శ్రీః

మహాకాలవిరచితః

# కర్పూరస్తవరాజః

మధురావ్యాఖ్యా - చింతగుంట సుబ్బారావు



ప్రకాశకులు

**శ్రీమతి రావి కృష్ణకుమారి**

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల**

శ్రీః

మహాకాలవిరచితః

# కర్పూరస్తవరాజః

మధురావ్యాఖ్యా - చింతగుంట సుబ్బారావు


ముద్రణ : ***24-05-2017***

*(Sapphire Wedding Anniversary of RaMoRa & Krishna Kumari)*

ప్రతులు : ***500***

పేజీలు : ***80***

వెల రూ. : ***50-00***





**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
**Andhra Pradesh.**
Cell : 9440115411



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

# కర్పూరస్తవరాజ పరిచయం

కర్పూరస్తవంలో ప్రస్తుతింపబడిన దేవత కాళిక. ఈమె దక్షిణకాళిక, ఈ స్తోత్రం కౌలసంప్రదాయపాత్రమైనది. దీని రచయిత మహాకాలుడు. ఈతడు ఋషియని కొందఱు, సాక్షాత్ మహాకాలదేవుడే యని కొందఱు భావించుట కద్దు.

ఈ స్తవంలో మొత్తం 22 శ్లోకాలున్నవి. ఈ శ్లోకాలకు మూలవస్తువు 22 అక్షరాలున్న విద్యారాజ్ఞీమంత్రము. వీనిలో మొదటి 6 శ్లోకాలున్ను మంత్రోద్ధార ప్రకరణము. ఇవి స్రగ్ధరావృత్తంలో నిబద్ధమైనవి. వీనిలో మొదటి శ్లోకంలో విద్యారాజ్ఞీ మంత్రభాగప్రథమమైన మూడు అక్షరాల క్రీం, క్రీం, క్రీం బీజమున్ను; రెండవ శ్లోకంలో రెండు అక్షరాల ఆవృత్తిగల హూం, హూం బీజమున్ను; మూడవ శ్లోకంలో రెండు అక్షరాలు ఆవృత్తిగల హ్రీం, హ్రీం బీజమున్నూ; 4వ శ్లోకంలో దక్షిణే కాలికే అన్న ఆరు అక్షరాలున్ను; 5వ శ్లోకంలో క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా అను 9 అక్షరాలున్ను, వెరశి మొత్తం 22 అక్షరాలు గల విద్యారాజ్ఞీమంత్రం ఉద్ధరింప బడినది. 6వ శ్లోకంలో తక్కువ ప్రాధాన్యంగల ఏకాక్షరి నుండి నవాక్షరీ, పంచదశాక్షరీ, ఏకవింశత్యక్షరీ ఇత్యాది మంత్రోద్ధారం చేయబడినది. వివిధ తంత్రశాస్త్రప్రమాణములు చూపబడినవి.

మొదటి ఆరు శ్లోకాలలో మంత్రోద్ధారంతోబాటు శ్రీ దక్షిణకాలికా సాధన, శ్రీ తారారహస్యపూజ, శ్రీ త్రిపురసుందరీ రహస్యపూజా విషయాలు గూడ నిక్షిప్తం చేయబడినవి. ఇది కాక ఈ మొత్తం 22 శ్లోకాల స్తవంలో సాధన సంబంధి విషయ బాహుళ్యం ఇట్లా ప్రస్తావించబడినది : శ్లో1 నుండి 8, 11 లలో ధ్యానవిషయం; శ్లో. 18లో యంత్రవిషయం; శ్లో. 10, 11, 15 నుండి 20 లలో సాధన విషయం; శ్లో. 13లో, శ్లో 19లో, శ్లో. 20 లో క్రమంగా మద్య, మాంస, మైథునముల విషయం; శ్లో. 21, 22 లలో ఫలశ్రుతి; మిగత శ్లో. 9, 12, 14లు స్తుతి విషయికములు. కొన్నిట జపవిధి చెప్పబడినది.

ప్రాసంగికముగ పశు, వీర, దివ్యభావాలను గురించి, శాక్తసాధనాచారాల గురించి, వాని వాని అధికారుల గురించి వ్యాఖ్యానించబడినది. అన్నిటికి తంత్రశాస్త్రములే ప్రమాణములు. అట్లే, సాధకులకు నిషిద్ధవిషయములేవియో తెలుపబడినవి. శ్లో 10, 17, 18 సాధకునకన్వయించునవి కాగా, శ్లో. 15, 16 సిద్ధునకన్వయించునవి.

సాధన ఫలించి సాధకుడు సిద్ధినొందిన తరువాత సాధన కర్మలన్నియు,

పూజాయజ్ఞయోగ, ధ్యాన, జప, వ్రత, పురశ్చరణాదులు అర్థరహితములైపోవును. సిద్ధుడు వీనికి అతీతుడైపోవును.

సాధకునకు ఆశ్రయమైనవేవి? అని ఆలోచిస్తే, నిత్యజీవితంలో ఒక కార్యసాఫల్యానికి మనం ఆశ్రయించవలసిన యే వ్యక్తినైన ఉదాహరణగా తీసికొంటే, ఆ వ్యక్తికొక భౌతికమైన విగ్రహరూపము, దానిని క్రియాశీలకంగా నియంత్రించే గౌణరూపము, ఈ గుణరూపాన్ని సచేతనం చేసే నామరూపము, దీని అంతటికి శక్తినిచ్చే మనోధర్మరూపము ఉన్నట్లు గమనించవచ్చు. సాధకుని ఉపాస్యదేవతకున్నూ ఈ రూపాలన్నీ ఉన్నవే. కనుకే సంపూర్ణోపాసన, విగ్రహారాధన, నామజపము, మంత్రజపము, బీజయుతంగా, స్థూలభౌతిక, వ్యావహారిక, శాబ్దిక, క్రియాకలాపాలతో సాగుతుంది.

ఈ ప్రక్రియలో దేవతారూపం, గుణం, నామం, బీజం, యంత్ర, తంత్ర, మంత్ర స్వరూపాలలో తోడ్పడుతవి. అనగా సాధన స్థూల, సూక్ష్మ, అతిసూక్ష్మ రూపాలలో భౌతిక, గౌణ, శాబ్దిక, బౌద్ధిక స్థితుల సమన్వయంతో ఫలోన్ముఖమవుతుంది. మనం నిర్వహించే అన్ని లౌకికకార్యాలలో వలెనే, ఇక్కడ కూడా, కొంత బహిరంగంలో, కొంత అంతరంగంలో ప్రవర్తిల్లుతుంది. కనుక కొంత రహస్యం తప్పదు, అంతమాత్రాన ఇది నిషిద్ధం కానక్కరలేదు. భావశుద్ధి సర్వప్రధానం, ఫలసిద్ధికి మూలం.



## ఉపయుక్తగ్రంథాలు

1. మహాకాలవిరచిత కర్పూరస్తవరాజస్య రుచిరావ్యాఖ్యా – ఆచార్య శ్రీ సదాశివదీక్షిత

2. కర్పూరస్తవరాజః – శ్రీనారాయణశాస్త్రీ ఖిస్తే విరచిత టీకా.

3. కర్పూరస్తవరాజః – With introduction and Translation by Arthur Avalon.

4. కర్పూరస్తవరాజః – శ్రీ విమలానందవిరచిత టీకా.



# విషయ సూచిక

**క్రీం**

శ్రీ మహాకాలవిరచితమగు 'కర్పూరస్తవరాజ' మనబడు

ఇక్కొళ గ్రంథమున కాలిడుటకు భావశుద్ధితో

పాటు సునిశితాధ్యయనము

తప్పనిసరి యని

గ్రహింతురు

గాక.

**– రామోరా, సంపాదకుడు**

## క్రీం

# కర్పూరస్తవరాజః

(మహాకాలవిరచితః)

ఓం అస్య కర్పూరస్తవరాజస్య మహాకాల ఋషిః, గాయత్రీ ఛందః శ్రీదక్షిణాకాలికా దేవతా, హలో బీజాని, స్వరాః శక్తయః, అవ్యక్తం కీలకం, శ్రీదక్షిణాకాలికా దేవతా ప్రసాదసిద్ధ్యర్థే తత్తత్ కామనసిద్ధయే వా వినియోగః ।

శ్లో॥ కర్పూరం మధ్యమాన్త్యస్వరపరరహితం సేన్దువామాక్షియుక్తం
బీజం తే మాతరేతత్త్రిపురహరవధు! త్రిఃకృతం యే జపన్తి ।
తేషాం గద్యాని పద్యాని చ ముఖకుహరాదుల్లసన్త్యేవ వాచః
స్వచ్ఛన్దం ధ్వాన్తధారాధరరుచిరుచిరే! సర్వసిద్ధిం గతానామ్ ॥ 1

శ్లో॥ ఈశానః సేన్దువామశ్రవణపరిగతో బీజమన్యన్మహేశి!
ద్వన్ద్వం తే మన్దచేతా యది జపతి జనో వారమేకం కదాచిత్ ।
జిత్వా వాచామధీశం ధనదమపి చిరం మోహయన్నంబుజాక్షీ -
వృన్దం చన్ద్రార్ధచూడే! ప్రభవతి స మహాఘోరశావావతంసే! ॥ 2

శ్లో॥ ఈశో వైశ్వానరస్థః శశధరవిలసద్వామనేత్రేణ యుక్తో
బీజం తే ద్వన్ద్వమన్యద్విగలితచికురే! కాలికే! యే జపన్తి ।
ద్వేష్టారం ఘ్నన్తి తే చ త్రిభువనమభితో వశ్యభావం నయన్తి
సృక్కద్వన్ద్వాస్రధారాద్వయధరవదనే! దక్షిణే కాలికేతి ॥ 3

శ్లో॥ ఊర్ధ్వం వామే కృపాణం కరకమలతలే ఛిన్నముణ్డం తతోఽధః ।
సవ్యేఽభీతిం వరం చ త్రిజగదఘహరే! దక్షిణే కాలికే! చ ।
జప్త్వైతన్నామ యే వా తవ విమలతనుం భావయన్త్యేతదమ్బ!
తేషామష్టౌ కరస్థాః ప్రకటితరదనే! సిద్ధయస్త్ర్యమ్బకస్య ॥ 4

శ్లో॥ వర్గాద్యం వహ్నిసంస్థం విధురతిలలితం తత్త్రయం కూర్చయుగ్మం
లజ్జాద్వన్ద్వం చ పశ్చాత్ స్మితముఖి! తదధష్ఠద్వయం యోజయిత్వా ।
మాతర్యే త్వాం జపన్తి స్మరహరమహిలే! భావయన్తః స్వరూపం
తే లక్ష్మీలాస్యలీలాకమలదలదృశః కామరూపా భవన్తి ॥ 5

శ్లో॥ ప్రత్యేకం వా ద్వయం వా త్రయమపి చ పరం బీజమత్యన్తగుహ్యం
త్వన్నామ్నా యోజయిత్వా సకలమపి సదా భావయన్తో జపన్తి ।
తేషాం నేత్రారవిన్దే విహరతి కమలా వక్త్రశుభ్రాంశుబిమ్బే
వాగ్దేవీ దేవి! ముణ్డస్రగతిశయలసత్కణ్ఠి! పీనస్తనాఢ్యే! ॥ 6

శ్లో॥ గతాసూనాం బాహుప్రకరకృతకాఞ్చీపరిలస –
న్నితమ్బాం దిగ్వస్త్రాం త్రిభువనవిధాత్రీం త్రిణయనామ్ ।
శ్మశానస్థే తల్పే శవహృది మహాకాలసురత –
ప్రసక్తాం త్వాం ధ్యాయఞ్జనని! జడచేతా అపి కవిః ॥ 7

శ్లో॥ శివాభిర్ఘోరాభిః శవనివహముణ్డాస్థినికరైః
పరం సంకీర్ణాయాం ప్రకటితచితాయాం హరవధూమ్ ।
ప్రవిష్టాం సన్తుష్టాముపరిసురతేనాతియువతీం
సదా త్వాం ధ్యాయన్తి క్వచిదపి న తేషాం పరిభవః ॥ 8

శ్లో॥ వదామస్తే కిం వా జనని! వయముచ్చైర్జడధియో
న ధాతా నాపీశో హరిరపి న తే వేత్తి పరమమ్ ।
తథాపి త్వద్భక్తిర్ముఖరయతి చాస్మానమితే!
తదేతత్ క్షన్తవ్యం న ఖలు పశురోషః సముచితః ॥ 9

శ్లో॥ సమన్తాదాపీనస్తనజఘనదృగ్యౌవనవతీ –
రతాసక్తో నక్తం యది జపతి భక్తస్తవ మనుమ్ ।
వివాసాస్త్వాం ధ్యాయన్గలితచికురస్తస్య వశగాః
సమస్తాః సిద్ధౌఘా భువి చిరతరం జీవతి కవిః ॥ 10

శ్లో॥ సమాః స్వస్థీభూతాం జపతి విపరీతాం యది సదా
విచిన్త్య త్వాం ధ్యాయన్నతిశయమహాకాలసురతామ్ ।
తదా తస్య క్షోణీతలవిహరమాణస్య విదుషః
కరామ్భోజే వశ్యా హరవధు! మహాసిద్ధినివహాః ॥ 11

శ్లో॥ ప్రసూతే సంసారం జనని! జగతీం పాలయతి చ
సమస్తం క్షిత్యాది ప్రలయసమయే సంహరతి చ ।
అతస్త్వాం ధాతాఽపి త్రిభువనపతిః శ్రీపతిరపి
మహేశోఽపి ప్రాయః సకలమపి కిం స్తౌతి భవతీమ్ ॥ 12

శ్లో॥ అనేకే సేవన్తే భవదధికగీర్వాణనివహాన్
విమూఢాస్తే మాతః! కిమపి నహి జానన్తి పరమమ్ ।
సమారాధ్యామాద్యాం హరిహరవిరఞ్చ్యాదివిబుధైః
ప్రపన్నోఽస్మి స్వైరం రతిరసమహానన్దనిరతామ్ ॥ 13

శ్లో॥ ధరిత్రీ కీలాలం శుచిరపి సమీరోఽపి గగనం
త్వమేకా కల్యాణీ గిరిశరమణీ కాలి! సకలమ్ ।
స్తుతిః కా తే మాతర్నిజకరుణయా మామగతికం
ప్రసన్నా త్వం భూయా భవమను న భూయాన్మమ జనుః ॥ 14

శ్లో॥ శ్మశానస్థః స్వస్థో గలితచికురో దిక్పటధరః
సహస్రం త్వర్కాణాం నిజగలితవీర్యేణ కుసుమమ్ ।
జపంస్త్వత్ప్రత్యేకం మనుమపి తవ ధ్యాననిరతో
మహాకాలి! స్వైరం స భవతి ధరిత్రీపరివృఢః ॥ 15

శ్లో॥ గృహే సంమార్జన్యా పరిగలితవీర్యం హి చికురం
సమూలం మధ్యాహ్నే వితరతి చితాయాం కుజదినే ।
సముచ్చార్య ప్రేమ్ణా మనుమపి సకృత్కాలి! సతతం
గజారూఢో యాతి క్షితిపరివృఢః సత్కవివరః ॥ 16

శ్లో॥ స్వపుష్పైరాకీర్ణం కుసుమధనుషో మన్దిరమహో
పురో ధ్యాయన్ ధ్యాయన్యది జపతి భక్తస్తవ మనుమ్ ।
స గన్ధర్వశ్రేణీపతిరపి కవిత్వామృతనదీ -
నదీనః పర్యన్తే పరమపదలీనః ప్రభవతి ॥ 17

శ్లో॥ త్రిపఞ్చారే పీఠే శవశివహృది స్మేరవదనాం
మహాకాలేనోచ్చైర్మదనరసలావణ్యనిరతామ్ ।
సమాసక్తో నక్తం స్వయమపి రతానన్దనిరతో
జనో యో ధ్యాయేత్త్వామయి జనని! స స్యాత్ స్మరహరః ॥ 18

శ్లో॥ సలోమాస్థి స్వైరం పలలమపి మార్జారమసితే!
పరం చౌష్ట్రం మైషం నరమహిషయోశ్ఛాగమపి వా ।
బలిం తే పూజాయామపి వితరతాం మర్త్యవసతాం
సతాం సిద్ధిః సర్వా ప్రతిపదమపూర్వా ప్రభవతి ॥ 19

శ్లో॥ వశీ లక్షం మన్త్రం ప్రజపతి హవిష్యాశనరతో
దివా మాతర్యుష్మచ్చరణకమలధ్యాననిరతః ।
పరం నక్తం నగ్నో నిధువనవినోదేన చ మనుం
జపేల్లక్షం స స్యాత్ స్మరహరసమానః క్షితితలే ॥ 20

శ్లో॥ ఇదం స్తోత్రం మాతస్తవ మనుసముద్ధారణమను
స్వరూపాఖ్యం పాదామ్బుజయుగలపూజావిధియుతమ్ ।
నిశార్ధే వా పూజాసమయమధి వా యస్తు పఠతి
ప్రలాపస్తస్యాపి ప్రసరతి కవిత్వామృతరసః ॥ 21

శ్లో॥ కురఙ్గాక్షీవృన్దం తమనుసరతి ప్రేమతరలం
వశస్తస్య క్షోణీపతిరపి కుబేరప్రతినిధిః ।
రిపుః కారాగారం కలయతి చ తం, కేలికలయా
చిరం జీవన్ముక్తః ప్రభవతి స భక్తః ప్రతిజనుః ॥ 22

ఇతి శ్రీమహాకాలవిరచితం
శ్రీ దక్షిణాకాలికాయాః స్వరూపాఖ్యాం స్తోత్రమ్
సమాప్తమ్ ।

క్రీం

మహాకాలవిరచిత

# కర్పూరస్తవరాజము

మధురవ్యాఖ్యావిరాజితము

## 1. మంత్రోద్ధార ప్రకరణము

**శ్లో॥ కర్పూరం మధ్యమాన్త్యస్వరపరరహితం సేన్దువామాక్షియుక్తం
బీజం తే మాతరేతత్త్రిపురహరవధు! త్రిఃకృతం యే జపన్తి ।
తేషాం గద్యాని పద్యాని చ ముఖకుహరాదుల్లసన్త్యేవ వాచః
స్వచ్ఛన్దం ధ్వాన్తధారాధరరుచిరుచిరే! సర్వసిద్ధిం గతానామ్ ॥ 1**

**అన్వయక్రమం :** ధ్వాన్తధారాధరరుచిరుచిరే! త్రిపురహరవధు! (హే) మాతః! మధ్యమాన్త్యస్వరపరరహితం సేన్దు వామాక్షియుక్తమ్ ఏతత్ తే కర్పూరం బీజం త్రిఃకృతం యే జపన్తి, సర్వసిద్ధిం గతానాం తేషాం ముఖకుహరాత్ గద్యాని పద్యాని చ వాచః స్వచ్ఛన్దమ్ ఏవ ఉల్లసన్తి ।

**ప్రతిపదార్థం :** ధ్వాన్తధారాధర = చీకటిమబ్బుయొక్క, రుచి = కాంతితో, రుచిరే = ప్రకాశించునట్టి, త్రిపురహర = మూడు పురములను నశింపజేసినవానియొక్క, వధు = ఇల్లాలవైన, (హే) మాతః = ఓ తల్లీ!, మధ్యమ = నడుమ, అన్త్య = చివరగల, స్వర = అచ్చులు, పర = పకార రకారములు, రహితమ్ = లేనిదై, సేన్దువామాక్షియుక్తమ్ = అనుస్వరముతో లేక బిందువుతో కూడిన 'ఈ' కలదైన, ఏతత్ = ఈ, తే = నీయొక్క, కర్పూరమ్ = కర్పూరమను, బీజమ్ = బీజమును, త్రిఃకృతమ్ = మూడుగా చేసి (ముమ్మారు), యే = ఎవరు, జపన్తి = జపించుచున్నారో, సర్వసిద్ధిం గతానామ్ = సిద్ధులన్నిటిని పొందిన, తేషామ్ = వారిదైన, ముఖకుహరాత్ = ముఖద్వారమునుండి, గద్యాని = గద్యములు, పద్యాని = పద్యములు, వాచః చ = వాక్కులును, స్వచ్ఛన్దమ్ ఏవ = తమంత తామే, ఉల్లసన్తి = ప్రకాశించుచున్నవి.

**తాత్పర్యం :** చీకటిమబ్బు కాంతితో ప్రకాశించే, త్రిపురహరుడగు శివుని ఇల్లాలవైన ఓ తల్లీ! నడుమను చివరనుగల అచ్చులున్ను, ప, ర అను హల్లులును లేనిదై, బిందువుతో కూడిన ఈకారముగల, కర్పూరం అనబడు ఈ నీ బీజమును ముమ్మారు జపించినవారికి సర్వము సిద్ధించును. వారి నోటినుండి గద్యపద్యాత్మక వాక్కులు అప్రయత్నముగనే వెలువడి రంజింపజేయును.

ఇది మొదలు ఆరవశ్లోకం వరకు మంత్రోద్ధారం. మంత్రము, మంత్రాధిదేవత, ఆ దేవతాస్వరూపము, శక్తిబీజము, ఉపాసనాఫలము, ఇత్యాదుల వర్ణన ఈ ఆరు స్రగ్ధరాశ్లోకాలలో చేయబడినది. **స్రగ్ధరావృత్తలక్షణం** : మ,ర,భ,న,య,య,య అనే గణాలతో పాదానికి 21 అక్షరాలు, యతి 7-7-7గా కలిగిన ప్రకృతిచ్ఛందానికి చెందినది. స్రగ్ధరా అనే వృత్తనామానికి మాలాలంకృత అని అర్థం. ఈ అర్థంలో ఈ కవి తన ఆరాధ్యదేవతకు పుష్పమాలలర్పించి స్వాగతిస్తూన్నట్లు ఉత్ప్రేక్షించవచ్చు.

ఈ స్తవానికి కర్పూరం అని పేరు. ఆ పేరునుండియే జపయోగ్యమైన దేవతాశక్తి బీజాన్ని ఉద్ధరించి చూపుతూన్నది కనుక ఈ స్తవభాగానికి మంత్రోద్ధారప్రకరణం అని శీర్షిక ఉంచబడినది. కర్పూరం అనే పేరు వినగానే తెల్లని రంగుతో సువాసనగల ద్రవ్యం, దైవానికి హారతులెత్తటం ప్రయోజనంగా గల వస్తువు, మనసులో స్ఫురిస్తుంది. ఈ కర్పూరలక్షణం, తాను తేజస్సుగా మారి, సువాసనల వ్యాపింపజేస్తూ తన పదార్థ స్వభావాన్ని కోల్పోయి క్రమంగా రంగు, రుచి, వాసన, ఆది గుణాలను మాపుకొని కేవల నిర్వికారానంతంలో లీనమైపోవటం. అంటే, స్థూల, సూక్ష్మ ప్రకృతులకు, కార్యకారణత్వాలకూ అతీతంగా విశుద్ధంలో లీనం కావటం. ఇదే క్రమంలో ఈ స్తవానికి అధిష్ఠాత్రియైన దేవతామూర్తి ప్రాకృతిక లక్షణాలను, వానికాధారమైన శక్తిలక్షణాలను, అతీతమైన బీజలక్షణాన్నీ ఈ స్తవం ప్రతిపాదిస్తూన్నది. అధిష్ఠాత్రివలెనే ఆమె శక్తి బీజమున్నూ బాహ్యస్థూలరూపం కలిగినదే. ప్రాకృతికంగా ఆ దేవత మేఘశ్యామలమూర్తి, త్రిపురహరప్రియ, జగన్మాత, బీజరూపంలో ఆమె 'క్రీం'. బీజమే శక్తిరూపం. కనుక సాధకులకు ఉపాస్యదేవత దక్షిణకాళిక, ఉపాస్యమంత్రం **'క్రీం'**. దక్షిణకాళిక శివశక్తులయొక్క ఏకీకృతరూప. ఈ రూపాన్నీమె బిందుమాత్రయై ప్రళయకాలంలో ధరిస్తుంది. ప్రళయాత్పూర్వం ప్రకృతిరూపధారిణియై వ్యాప్తరూపంలో నానారూపధాత్రి యవుతుంది. ఈ కారణంగా జగన్మాతగా భావింపబడినది.

ఈ కర్పూరం అనే స్తవనామంనుండి ఉపాస్య 'క్రీం' బీజోద్ధారణక్రమం ఇట్లా వివరింపబడింది: 'కర్పూరం' అనే అక్షరాలలో మధ్యమాక్షరం 'ర్పూ' అన్నదానిలోనుండి, దానిని విభజిస్తే వచ్చే 'ర్ + ప్ + ఊ' అనువానిలోని 'ప్' అన్న హల్లునూ, 'ఊ' అన్న అచ్చునూన్ను అన్తిమ రకారం, 'ర్ + అ' లోని అకారాన్ని లోపింపజేసినట్లయితే, అవశేషమైనవి 'కర్పూరం' పదంలోని కకార రకారాలు, క్ + ర్. (క = క్ + అ, అయినప్పటికి ఇందలి అకారం కకారానికి ఉచ్చారణదోహదమే తప్ప అన్యథా గణనీయం కాదు.) ఈ రెండు హల్లులు కలిసి 'క్ర్' అవుతవి. కాగా, దీనికి 'రమ్' లోని

అనుస్వారబిందువు ఉండనే ఉన్నది కనుక, దాన్ని 'ఈ'తో చేర్చి 'ఈం' చేసి కలిపినట్లయితే క్ర్ + ఈం = క్రీం అనే బీజాక్షరం సిద్ధిస్తుంది. ఈ బీజాక్షరం విత్తనం వలె వృక్షంకాగల శక్తి. దీనిని ముమ్మారు జపిస్తే ఫలవంతమవుతుంది (బీజం తే త్రిఃకృతం యే జపన్తి). 'క్రీం' ను విభజిస్తే క్ + ర్ + ఈ + మ్ అని నాలుగు ధ్వనులవుతాయి. ఇవి ధర్మార్థ కామమోక్షాలనబడే నాలుగు పురుషార్థాలను సాధించగలవని **తోడలతంత్రోక్తి** :

శ్లో॥ కకారం ధర్మదం దేవి, ఈకారం చార్థదాయకమ్ ।
రకారం కామదం కాన్తే, మకారం మోక్షదాయకమ్ ।
ఏకత్రోచ్చారణాత్ దేవి, నిర్వాణమోక్షదాయినీ ॥

ఈ నాలుగు ధ్వనులను ఒకటిగా చేసి **'క్రీమ్'** అని పలికినట్లయితే నిర్వాణముక్తి లేక విదేహముక్తి లభిస్తుందని భావం.

కకార రకారాలవలన ఈ మంత్రాధిష్ఠాత్రియైన దక్షిణకాళికయొక్క స్వరూప నిరూపణమున్నూ, 'ఈమ్' అను బిందుసంయుత ఈకారం వలన ఆమె ఫలదాయకత్వమున్నూ సిద్ధిస్తాయని **యామలతంత్రప్రమాణం** :

శ్లో॥ కకారోజ్జ్వలరూపత్వాత్ కేవలం జ్ఞానచిత్కలా
జ్వలనార్ణసమాయోగాత్ సర్వతేజోమయీ శుభా ।
దీర్ఘేకారేణ దేవేశి సాధకాభీష్టదాయినీ
బిన్దూనాం నిష్కలత్వాచ్చ కైవల్యఫలదాయినీ ॥

ఉజ్జ్వలరూపత్వం కకారార్థం కనుక 'క్రీమ్' లోని కకారం జ్ఞానచిత్కళకాగా, అందలి రకారం అగ్నిబీజం కనుక, దానితో కలిసి సర్వతేజోమయిగా శుభదాయకమవుతుంది. ఇక ఈకారం సాధకుని లౌకికాభీష్టాలను సిద్ధింపజేయగా, దానితో చేరియున్న బిందువు, స్వయం నిష్కలం కనుక, అనగా అవిభాజ్యం కనుక, కైవల్యముక్తిని కలిగించగలదని అర్థం.

వరదతంత్రానుసారం, కకారము కాళీబీజము, రకారము బ్రహ్మబీజము, ఈకారము మహామాయాబీజము, బిందువు సంతాపహరబీజము, వీని సంయోగంలో జనించే 'క్రీం' నాదము విశ్వయోని బీజము. ఈ బీజాక్షర రహస్యమే **'కరీమ్'** అన్న పదంలోనూ ఇమిడి యున్నది.

ఇది మంత్రాధిదేవత బీజాక్షరమంత్రస్వరూపమూ, తదుపాసనాఫల

స్వరూపమున్నూ. వివిధతంత్రాలు ఈ అక్షరాలకు నిర్దేశించి చెప్పిన బీజార్థాలు ఇట్లా ఉండగా, సాధారణ నిఘంట్వర్థాలను పరిశీలిస్తే, కకారానికి, కః, కం, అను రెండు రూపాల్లోనూ ఈ అర్థాలు లభిస్తాయి :

| కః | కం |
|---|---|
| 1. బ్రహ్మ, విష్ణు, కామదేవ, అగ్ని, వాయు, యమ, సూర్య | 1. సంతోషము |
| 2. ఆత్మ, 3. రాజు, 4. ముడి, 5. నెమలి, | 2. నీరు |
| 6. పక్షి, పక్షిరాజు, 7. మనస్సు, 8. శరీరం, | 3. తల |
| 9. కాలం, 10. మబ్బు, 11. శబ్దము, పదము, | |
| 12. వెంట్రుక. | |

అట్లాగే రకారానికి, 1. అగ్ని, 2. వేడి, 3. ప్రేమ, 4. కోరిక, 5. వేగము అన్న అర్థాలు 'రః' అనుదానికివ్వబడినవి. ఈకారానికి కామదేవుడనిన్నీ.

కొన్ని సామాన్యార్థాలు కలిసినప్పటికి బీజాక్షర నిఘంటువుల ప్రత్యేకావసరం ఇట్టి తావులలో తప్పదు.

ఈ మంత్రబీజం మంత్రాధిష్ఠాత్రియైన దక్షిణకాళికయొక్క శక్తిప్రసారం. ఈ దేవత స్వరూపం కవి ఈమెను సంబోధించిన 'ధ్వాన్తధారాధరరుచిరుచిరే' అన్నదానిలో ప్రస్ఫుటంగా ప్రకటమవుతూన్నది. ఈ పదబంధానికి అర్థం చీకటికమ్మినట్లుండే మబ్బువలె నల్లనిది, అనగా, మేఘశ్యామలమూర్తి, అని. నల్లని మబ్బు వర్షించే లక్షణం కలది కనుక ఫలప్రదత్వం ప్రతిఫలిస్తూన్న వర్ణమిది. కాగా, శ్యామా అన్న స్త్రీజాతి లక్షణంగా,ఈ దేవతాశక్తి శీతాకాలంలో వెచ్చదనాన్నీ, వేసవిలో చల్లదనాన్నీ, అనగా యథావసరం ఫలాన్నిచ్చేది అనిన్నీ సూచన. ఈమె ఫలప్రదత్వం లౌకికమూ అలౌకికమూ కూడా అని ముందే చెప్పబడిన దానికి సరితూగేదే యీ నలుపు. నిజానికి నలుపు ఒక రంగు కాదు. రంగులన్నవి రజోగుణవికారమువలన తెల్లని కాంతిలో (సత్త్వప్రకాశంలో) యేర్పడి, మరల రజోగుణం విశ్రమించినప్పుడు తెల్లగా సత్త్వకాంతితో ప్రకాశిస్తూ ప్రళయోదయాదులలో మరల మరల సర్వదా జరుగుతూండే ఒక ప్రక్రియకు సాంకేతికములనవచ్చు. కాని ప్రళయకాలంలో గుణాతీత విశుద్ధసత్త్వస్థితికి ప్రతీక నలుపు. తెలుపు విభాజ్యమైనట్లు నలుపు కాదు. కనుక ఈ శ్యామలత్వం శివశక్తుల ఏకీకృత స్వరూపం. మరి శివుడో, త్రిపురహరుడు, అనగా, స్థూల సూక్ష్మ కారణ శరీరములను

(పురములను) హరించి కార్యకారణత్వలక్షితమూ కర్తృభోక్తృత్వబంధకర్మ ప్రచోదితము అయిన విశ్వసృష్టికి అతీతుడైనవాడు. దీనినే సువర్ణ, రజిత, లోహ పురములుగా అంతరిక్షాన, వాయువులో, భూమిపైనను అసురులు నిర్మించికొన్నవిగాను, వానిని ఏకకాలంలో శివుడు నశింపజేసినట్లున్ను, ఆ త్రిపురసుందరి శివుని వరించినట్లును పురాణ కథారూపంలో సంకేతించినారు. ఆ త్రిపురనాశానంతరము శివునకు వశమైన సుందరి ఈ శుద్ధసత్త్వప్రకాశియైన శ్యామలయే, దక్షిణకాళికయే.

ఈమె మాతృరూపంలో భావింపబడినది. మాతృశబ్దానికి 'మా' 2వ గణధాతువు పరస్మైపదిరూపంనుండి వ్యుత్పత్తి చెప్పబడినది. అర్థం, పరిమితిని కల్గించు, కొలుచు, అని. దీని బట్టి మాతృస్వభావం తన బిడ్డలకు ఎవరికెప్పుడు ఏది ఎంత కావలెనో దానిని తెలిసి దయచేయటం. కనుక మాతృభావనలోనే సాధకుని ఫలాసక్తి, సాధనల లక్ష్యం, ఉపాసనాఫలం, తద్దేవతా ఫలప్రదాయిత్వం ఇమిడియున్నవి. అయితే, ఈ దేవత యోగ్యతనెరిగి ప్రదానం చేస్తుందన్నది మాతృశబ్దవ్యుత్పత్తి సూచిస్తుంది. కనుక **'సర్వసిద్ధిం గతానామ్'** అన్న పదబంధం, క్రీం బీజాన్ని జపించిన వారికి అందరికీ అన్ని సిద్ధులూ లభిస్తాయి, అన్న అర్థాన్ని బోధించదు. సర్వశబ్దం సమష్టిని చెప్పేది కాగా 'సిద్ధిం' అన్న ఏకవచనరూపం వ్యష్టిని చెప్పేది. కనుక మంత్రసిద్ధిని సాధించినవారికి కలిగే ఫలమే సూచితం కాని జపించిన వారందరికీ ఈ ఫలం, జపమంత్రంచేత, సిద్ధిస్తుందని కాదు. అంతటి శక్తివంతమైన బీజాన్ని జపించినవారికి వాక్శుద్ధి, వాక్సిద్ధి కలగటంలో ఆశ్చర్యం లేదు. కనుకే వారి వాక్కులు గద్యపద్యాత్మకములై అప్రయత్నంగా, ఆశువుగా వెలువడి ఉల్లాసాన్ని కలిగిస్తాయి. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం అన్న ఎన్మిది సిద్ధులుగా చెప్పబడినవి. ఇవి కాక, విదేహముక్తిసైతం లభిస్తుందన్నది ఫలశ్రుతి.

**క్రీం క్రీం క్రీం దక్షిణకాలికాయై నమః ।**



**శ్లో॥ ఈశానః సేన్దువామశ్రవణపరిగతో బీజమన్యన్మహేశి!**
**ద్వన్ద్వం తే మన్దచేతా యది జపతి జనో వారమేకం కదాచిత్ ।**
**జిత్వా వాచామధీశం ధనదమపి చిరం మోహయన్నంబుజాక్షీ -**
**వృన్దం చన్ద్రార్ధచూడే! ప్రభవతి స మహాఘోరశావావతంసే! ॥ 2**

**అన్వయక్రమం :** (హే) మహేశి! (హే) చన్ద్రార్ధచూడే! (హే) మహాఘోరశావావతంసే!

సేన్దువామశ్రవణపరిగతః ఈశానః (ఇతి) తే అన్యత్ బీజం ద్వన్ద్వం కృత్వా యది మన్దచేతాః జనః కదాచిత్ ఏకం వారమ్ అపి జపతి, (తదా) స చిరం వాచామ్ అధీశం ధనదమ్ అపి జిత్వా అంబుజాక్షీవృన్దం మోహయన్ ప్రభవతి ।

**ప్రతిపదార్థం :** (హే) మహేశి = మహేశ్వరుని పట్టమహిషీ!, చంద్రార్ధచూడే = చంద్రవంకను తలమానికముగ ధరించినదానా!, మహాఘోర = అతిభయంకరమైన, శావ = శవసంబంధమైన, అవతంసే! = కర్ణభూషణము గలదానా, ఆభరణములు కలదానా!, సేన్దు = అనుస్వరముతో కూడిన, వామశ్రవణపరిగతః = ఊకారముతో జతగూర్పబడిన, ఈశానః = హకారము, ఇతి = అనబడు, తే = నీయొక్క, అన్యత్ = వేరొక, బీజమ్ = బీజాక్షరము, ద్వన్ద్వం (కృత్వా) = రెట్టింపుచేసి, రెండుసార్లుగా, మన్దచేతాః జనః = మందబుద్ధియైనవాడు, కదాచిత్ = ఒకప్పుడెప్పుడైన, ఏకమ్ = ఒకేఒక్క, వారం అపి = రోజు అయినను, జపతి యది = జపించినట్లయిన, (తదా = అప్పుడు),సః = అతడు, వాచామ్ = వాక్కులకు, అధీశమ్ = అధిపతియైన బ్రహ్మను, ధనదమ్ = కుబేరుని, అపి = కూడ, జిత్వా = జయించి, చిరమ్ = చాలాకాలము, అంబుజాక్షీవృన్దమ్ = స్త్రీసమూహమును, మోహయన్ = మోహింపజేయుచు, ప్రభవతి = ఆనందించును.

**తాత్పర్యం :** చంద్రవంకను శిరోభూషణముగను, అతిభయంకరశవభూషలను ధరించిన ఓ మహేశ్వరుని పట్టపుదేవీ! నీ బీజాక్షరమైన **'హూం'** ను రెండు సార్లుగా జపించినచో, ఒక్కరోజైనను చాలు, అదెప్పుడైనను సరే, మందబుద్ధియైనను చాలకాలము బ్రహ్మదేవుని మించిన వాక్చాతుర్యమును, కుబేరుని మించిన ధనసమృద్ధిని కలిగి అందమైన స్త్రీలను మోహింపజేయుచు ఆనందించగలడు.

శ్రీ దక్షిణకాళికాదేవికి శక్తిబీజమైన రెండవ అక్షరము 'హూం'. దీనిని 'హూం హూం' అని రెండుసార్లు ఒక ఆవృత్తిగా చేసి ఒక్కరోజైన, అది యే రోజైన, సమయ మేదైన, జపించినట్లయిన, వాక్సిద్ధి, స్త్రీవశీకరణ, ఫలముగా లభించునన్నది తాత్పర్యము. కదాచిత్, వారమేకం శబ్దాల ప్రయోగంవలన దేశకాలసంబంధమైనవిగాని శౌచాశౌచ సంబంధి నియమనిష్ఠలుగాని ఈ జపానికి చెప్పబడలేదని స్పష్టమవుతున్నది. దీనికి కారణం ఈ దేవతాసంబంధంగాను, తద్బీజసంబంధంగాను అపవిత్రత అన్నదానికి తావేలేదు. సర్వత్ర సర్వకాలిక శుభదమైనవిగా భావింపబడినవి. కాళి కాలస్వరూపిణి. ఆమెను అశౌచమంటదు, ఆమె అశుభమునివ్వదు. ఇందుకు **పురశ్చర్యార్ణవం** లోని క్రింది శ్లోకాలు ప్రమాణం :

శ్లో॥ సర్వ ఏవ శుభః కాలో నాశుభో విద్యతే క్వచిత్ ।
న విశేషో దివా రాత్రౌ న సన్ధ్యాయాం మహానిశి ॥

శ్లో॥ దిక్కాలనియమో నాస్తి తిథ్యాదినియమో న చ ।
న జపే కాలనియమో నార్చాదిషు బలిష్వపి ।
స్వేచ్ఛానియమ ఉక్తోఽత్ర మహామన్త్రస్య సాధనే ॥

శ్లో॥ న దేశకాలనియమో భక్ష్యాదినియమో న హి
శౌచాదినియమో నాస్తి మహామన్త్రస్య సాధనే ।
దివసే వా తథా రాత్రౌ రాత్రిశేషే నిశాముఖే
...................................... చరేజ్జపమ్ ॥

శ్లో॥ పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ।
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్ అపి ।
సర్వదైవ జనః కుర్యాత్ న దోషస్తత్ర కశ్చన ॥

అర్థాత్, కాలము సర్వము శుభమే. ఏవిధమైన అశుభము ఉండదు. పగటియందుగాని రాత్రియందుగాని, సంధ్యాసమయమునగాని, అర్ధరాత్రియందుగాని విశేషము లేదు. ఈ మహామన్త్రసాధనలో దేశకాల నియమములేదు, తిథిమొదలుగాగల నియమము గూడా లేదు. జపమునందు కాలనియమము లేదు. అర్చాదులందును నైవేద్యములలోను గూడ స్వేచ్ఛానియమము, అనగా సాధకుని ఇచ్ఛానుసారము చేయవచ్చునను నియమము చెప్పబడినది. దేశకాలనియమము, ఆహారనియమము, శుచి–అశుచి అను నియమము లేక ఈ మంత్రసాధనలో పగలు గాని రాత్రిగాని, తెల్లవారుజామున గాని సాయంసంధ్యా సమయానగాని జపముచేయనగును. చూచుచు, వినుచు, తాకుచు, వాసనజూచుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, ఊపిరిపీల్చుచు వదలుచు, మాటాడుచు, విసర్జించుచు, స్వీకరించుచు, కనుఱెప్పలల్లార్చుచు, ఱెప్పలార్పకుండియు కూడ, అనగా సర్వకాల సర్వావస్థలందు సర్వత్ర అందఱు జపించవచ్చును. అందు యే విధమైన దోషము లేదు.

జపించవలసినది హూం బీజము. క్రీం అని మొదటి శ్లోకంలో చెప్పబడిన బీజాక్షరమును ముమ్మారొక ఆవృత్తిగా జపించిన తర్వాత ఈ హూం బీజమును రెండుసార్లొక ఆవృత్తిగా జపించవలెను. ఈ బీజంలోని హకారము శివునియొక్కయు, ఊకారము భైరవునియొక్కయు, బిందువు సంతాపవినాశకతయొక్కయు, 'హూం' నాదము

శ్రేష్ఠత్వముయొక్కయు చైతన్యమును కలిగించునని వరదతన్త్ర వివరణ. ఈ 'హూం' అను రెండవ బీజాక్షరానికి **కూర్చబీజమని** కూడ పేరు.

ఈ బీజాక్షరజపఫలాన్ని వర్ణిస్తూ తాత్పర్యంగా చెప్పబడినవి రెండు అంశాలు: మొదటిది : అత్యధిక ధనవంతుడవుతాడన్నది; రెండవది పాండిత్యం. ఈ రెండిటి ఆకర్షకశక్తివలన స్త్రీలను సమ్మోహితులను చేయగలుగునన్నది మూడవది. అట్లే, 'ప్రభవతి' అన్న క్రియకు సామాన్యార్థాన్నే కాక, విశేషార్థంగా ప్రభుతవహించగలడనిగూడ చెప్పబడింది. స్త్రీజనాకర్షకమైన యౌవనము, సుస్వరూపము, కామకళాభిజ్ఞత అను మూడు లక్షణాలు లేని ముదుసలికూడ ఈ దేవి అనుగ్రహంతో బీజజపంవలన స్త్రీజనాన్ని ఆకర్షించగలడని శ్రీశంకరాచార్యోక్తి. అయితే, ఇది సాధకుని, ఆతడు యువకుడైన, వృద్ధుడైన, మహాఫలప్రాప్తికి దూరంచేసే అల్పఫలమే సుమా అన్న హెచ్చరికగా భావించ దగినది.

'వాచామధీశం' అనగా బృహస్పతియనికూడ చెప్పవచ్చును. విద్వత్తునకు వివేకమునకు దేవగురువైన బృహస్పతిని ధీశక్తిప్రదాతగా జ్యోతిశ్శాస్త్రం చెబుతుంది.

ఈ 'హూం' బీజాధిష్ఠాత్రిగా దక్షిణకాళికా స్వరూపప్రశంస చేయబడినది. ఈ దేవతా సంబోధన మూడు విధములుగా రూపించబడినది : ఒకటి, మహేశి; రెండు, చంద్రార్ధచూడే; మూడు, మహాఘోరశావావతంసే. ఒక్కొక్కటిగా ఈ మూడు రూపాలను, వాని సాంకేతిక సార్థకతను పరిశీలిస్తే,

**మహేశి** – అన్నదాని ప్రథమైకవచనరూపం మహేశీ. ఈ శబ్దాన్ని మహా + ఈశీ, అని విభజించి, గొప్ప ఐశ్వర్యవంతురాలు, అని సామాన్యార్థం చెప్పి, ఈ గొప్ప ఐశ్వర్యమనుదానిని సృష్టి, స్థితి, లయాది విశ్వకార్యకారణిగా విశేషార్థాన్ని చెప్పవచ్చు. ఇందామె ఆదిశక్తి, సర్వతంత్రస్వతంత్ర, స్త్రీపురుషభేదరహిత. కనుక, భాషాపరంగా ఈ శబ్దం స్త్రీలింగవాచకమైనప్పటికి, తదతీత పరబ్రహ్మగా భాసమాన అవుతుంది. లేక, 'మహేశీ' శబ్దాన్ని మహేశుని సతిగా భావించినట్లయితే, త్రిమూర్తులు బ్రహ్మ విష్ణు రుద్రులనబడువారికి ప్రభువైన మహేశ్వరుని పట్టమహిషిగా, ముగురమ్మల మూలపుటమ్మగా సాకార స్త్రీమూర్తిగా జగన్మాత, జగద్ధాత్రి అవుతుంది.

**చంద్రార్ధచూడా** – అన్న స్వరూపంలోని చంద్రప్రసక్తివలన అంధకారాన్ని తొలగించునదనిన్నీ, అర్ధచంద్రశబ్దంలో అంతర్లీనంగా వృద్ధిబీజమున్నూ కలది కనుక

క్రమ పరిణామంలో పూర్ణజ్ఞానాన్ని ప్రసాదించి, అజ్ఞానాంధకారాన్ని పూర్తిగా తొలగించే మాతృరూపగురుమూర్తియై ప్రకాశిస్తుంది. ఏతద్జ్ఞానవృద్ధికారణంగా సంసార తాపమోచనం సాధకునికి ఫలంగా లభిస్తుంది. తద్వారా ఆమె భక్తానందకరి యవుతుంది.

**మహానిర్వాణతన్త్రం** లోని,

శ్లో॥ నిత్యాయాః కాలరూపాయాః అరూపాయాః శివాత్మనః ।
అమృతత్వాత్ లలాటేఽస్యాః శశిచిహ్నం నిరూపితమ్ ॥

అన్న ప్రమాణాన్ని బట్టి, ఆ దేవి నిత్య, కాలరూప, అరూప, శివాత్మిక, కనుక అమృతమూర్తి. ఆ అమృతత్వచిహ్నంగా ఆమె ఫాలభాగాన అర్ధచంద్రస్ఫూర్తి. ఆ రూపం ఆమె నిర్వాణమోక్షదాయిత్వానికి ప్రతీక, అని వ్యాఖ్యానింపబడినది.

**మహాఘోరశావావతంసా –** అనగా, అతిభయంకరమైన శవభూషణములచే అలంకరింపబడినది. లేక, అవతంసపదానికి గల విశేషార్థాన్ని స్మరించి, అతిభయంకరమైన శవములను కర్ణభూషణములుగా కలిగినది, అని అర్థం చేయవచ్చు. ఈ పదబంధానికి పాఠాంతరంలో, **మహాఘోరబాలావతంసా**, అని యున్నది. దీనిని స్వీకరించి, కాళికకు ప్రియమైన సాధకులు రెండు తెఱగులవారు : శంకరునివలె నిర్వికారులు, బాలకులవలె నిష్కాములు, అనుదానికీ రెండు పాఠములు అన్వయించునని వ్యాఖ్యానించినారు. దీనికి ప్రమాణము :

శ్లో॥ క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా బాలః క్రీడతి వస్తుని ।
తథైవ రమతే విద్వాన్ నిర్మమో నిరహం సుఖీ ॥

(ఆకలిని, శరీరక్లేశాన్ని విడచి బాలుడు ఎట్లు వస్తువులందాసక్తుడగునో, అట్లే విద్వాంసుడు మమకారమును అహంకారమును విడచి సుఖముగ ఆనందించును) అను **వివేక చూడామణి** వాక్యమొకటియు,

శ్లో॥ యథా కుమారో నిష్కామ ఆనన్దమ్ ఉపయాతి ।
అను **బ్రహ్మోపనిషద్వాక్య**మున్ను.

ఈ వర్ణనవలన, సాధకుడు కామక్రోధాద్యరివర్గమును జయించిన తరువాతే కాళికోపాసన చేయదగునని సూచితము. ఇది అసాధారణము కనుక, ఉపాసనా సమయములందు తప్పక కామక్రోధాదులను వికారములు సాధకునియందు కలుగరాదని హెచ్చరిక.

శ్లో॥ కామాదీంశ్చ రిపూన్ హత్వా శిరః కంఠాదిభూషణమ్ ।
కృత్వా సమ్యక్ స్థితాం కాలీం చిన్తయేద్బ్రహ్మరూపిణీమ్ ॥
–కాలీతన్త్ర

(కామాది రిపులను చంపి, అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లనబడు లోని శత్రువులను చంపి, శిరస్సును, కంఠము మొదలగువానిని భూషణముగా చేసి చక్కగా కాళిని, బ్రహ్మరూపిణిగా స్థాపించి, ఉపాసింపవలెను.)

**హూం హూం దక్షిణకాలికాయై నమః ।**



**శ్లో॥ ఈశో వైశ్వానరస్థః శశధరవిలసద్వామనేత్రేణ యుక్తో**
**బీజం తే ద్వన్ద్వమన్యద్విగలితచికురే! కాలికే! యే జపన్తి ।**
**ద్వేష్టారం ఘ్నన్తి తే చ త్రిభువనమభితో వశ్యభావం నయన్తి**
**సృక్కద్వన్ద్వాస్రధారాద్వయధరవదనే! దక్షిణే కాలికేతి ॥** 3

**అన్వయక్రమం :** (హే) విగలితచికురే! (హే) సృక్కద్వన్ద్వాస్రధారాద్వయధరవదనే! హే దక్షిణే కాలికే! వైశ్వానరస్థః శశధరవిలసద్వామనేత్రేణ యుక్తః ఈశః (ఇతి) తే అన్యత్ బీజం ద్వన్ద్వం (కృత్వా) కాలికా ఇతి యే జపన్తి తే ద్వేష్టారం ఘ్నన్తి, త్రిభువనమ్ అభితః వశ్యభావం చ నయన్తి ।

**ప్రతిపదార్థం :** (హే) విగలిత = విరబోసిన, చికురే = కేశసంపదగలదానా!, (హే) సృక్కద్వన్ద్వ + అస్రధారాద్వయధర = ఇరుపెదవులనుండి కారుచున్న రెండు రక్తధారలు కలిగిన, వదనే = ముఖముగలదానా!, (హే) దక్షిణే కాలికే = ఓ దక్షిణకాళికా!, వైశ్వానరస్థః = రకారముతో కలిసియున్న, శశధరవిలసద్వామనేత్రేణ యుక్తః = అనుస్వరముతో కూడి ఈకారముగల, ఈశః = హకారము, తే = నీయొక్క, అన్యత్ = వేరొక, బీజమ్ = బీజాక్షరమును, ద్వన్ద్వమ్ (కృత్వా) = రెండుసార్లుగ చేసి, కాలికా ఇతి = కాళికయని, యే = ఎవరు, జపన్తి = జపించుచున్నారో, తే = వారు, ద్వేష్టారమ్ = తమను ద్వేషించువానిని, ఘ్నన్తి = నశింపజేయుచున్నారు, త్రిభువనమ్ = త్రిభువనములను, అభితః = తమకు అనుకూలముగ, వశ్యభావం చ = వశమగునట్లు కూడ, నయన్తి = నడిపించుచున్నారు.

**తాత్పర్యం :** జుట్టు విరబోసికొని, రెండుపెదవులనుండి కారుతున్న రెండు రక్తధారలు

గల ముఖముగల ఓ దక్షిణకాళికా! రకారముతోను బిందుయుక్త ఈకారముతోను కూడిన హకారము (అనగా హ్ + ర్ + ఈం = హ్రీం) అనునది నీ మఱియొక బీజాక్షరము. దీనిని రెండుసార్లొక ఆవృత్తిగా హ్రీం, హ్రీం అని జపించిన భక్తులను ద్వేషించువారు నశింతురు. వారు మూడు లోకములను తమకు అనుకూలమగునట్లు చేసికొనగలరు.

**'హ్రీం'** బీజానికి **లజ్జాబీజము**నియు పేరు. హ్రీ శబ్దానికి లజ్జయనియే సామాన్యార్థము కనుక ఈ పేరు కలిగియుండును. ఈ బీజాక్షరములోని హకారము శివుడని, రకారము ప్రకృతియని, ఈకారము మహామాయయని, బిందువు సంతాపహారిణియని, ఈ హ్రీం నాదము విశ్వయోనియని **వరదతన్త్రోక్తి.** దేవీభాగవతం, సప్తమస్కంధంలో, హకారము స్థూలదేహాన్నీ, రకారము సూక్ష్మదేహాన్నీ, ఈకారము కారణశరీరాన్నీ సూచిస్తాయని, మొత్తం హ్రీం కారము భగవతి కాళీబోధకమనిన్నీ, హకారము రకారమును విలీనముచేసి, రకార ఈకారములను విలీనము చేసి, యథాక్రమం విశ్వాత్మను, తైజసాత్మను వాని వానిలో విలీనముచేసి, హ్రీంకారమున చిదాత్మను విలీనము చేయవలెను, అని బోధిస్తుంది :

శ్లో॥ హకారః స్థూలదేహః స్యాత్ రకారః సూక్ష్మదేహకః ।
ఈకారః కారణాత్మాసౌ హ్రీంకారోఽహం తురీయకమ్ ।
హకారం విశ్వమాత్మానం రకారే ప్రవిలాపయేత్ ।
రకారం తైజసం దైవం ఈకారే ప్రవిలాపయేత్ ।
ఈకారం ప్రాజ్ఞమాత్మానం హ్రీంకారే ప్రవిలాపయేత్ ॥ (దేవీభాగవతం)

జ్యోతిస్స్వరూప వైశ్వానరస్థుడై సూక్ష్మబీజాత్మక ఈశ్వరుడు చంద్రశేఖరుడు అమృతసత్త్వగుణాత్మికయైన మాయను కూడియున్నాడు : కనుక సాధకుడు ఈ శివశక్తిద్వంద్వ (అనగా ప్రకృతీపురుషాత్మక) అర్ధనారీశ్వరరూపాన్ని ధ్యానించవలెనన్న విశేషార్థం కూడ వ్యక్తమవుతుంది.

ఈ హ్రీం బీజాన్ని ద్విగుణంగా హ్రీం హ్రీం అనునదొక ఆవృత్తిగా జపించవలెను.

ఈ హ్రీం బీజరూపమే రహీం శబ్దము.

ఇట్లుపాసించినవారికి కలిగేఫలం కూడ వర్ణితమైనది : ద్వేష్టారం ఘ్నన్తి,

అన్నదొక ఫలం. ద్వేష్టారం అంటే ద్వేషించువానిని, అని అర్థం. ఇక్కడ ఈ శబ్దం ద్వితీయైకవచనరూపంలో ఉన్నది కనుక ఉపాసకుని ద్వేషించేవాడు ఒక్కడే ఉంటాడని వాచ్యార్థం చెప్పటం కాదు. ద్వేషించే ప్రతియొక్కనిని నశింపజేయగలదీ శక్తిబీజం. మనిషికి మనిషి శత్రువన్నది ప్రసిద్ధమే కదా, ఆ శత్రుత్వమే ప్రస్తావింపబడినదా? అంటే, కాదనే చెప్పాలి. భగవద్గీతాప్రార్థన శ్లోకంలో 'భవద్వేషిణీ' అని గీతను వర్ణించినప్పుడు చెప్పినట్లే నిరాకరణను అర్థంగా చెప్పి, ఆ నిరాకరించువారెవరని ఆలోచిస్తే, సాధనను నిరాకరించి విఘ్నాలు కల్పించే శత్రువులు కామక్రోధాదులారు. వీనిని నశింపజేస్తుందని భావం గ్రాహ్యం. షడ్వర్గాన్ని జయించినవానికి తరువాతిదిగా చెప్పబడిన త్రిభువనశాసకశక్తి లభించటం సహజోక్తి. అట్లే ఆతడు సంసారముక్తుడున్నూ కాగలడు.

త్రిభువనాలు అంటే స్వర్గ, మర్త్య, పాతాళ లేక నాగ లోకాలు. ఈ లోకాలలో నివసించేవారు స్వర్గంలో దేవతలు, మర్త్యంలో మానవులు, పాతాళంలో దానవులు (నాగలోకంలో నాగులు). వీరినందఱను తన కనుకూలంగా ఉంచగలడు. ఈ బీజాన్ని రెండుసార్లొక ఆవృత్తిగా జపించిన సాధకుడు పురుషార్థాలైన ధర్మార్థకామమోక్షాలను సాధించగలడని, లౌకికంగా రాజయోగం ప్రాప్తిస్తుందనిన్నీ **విశ్వసారతన్త్రం**లో ఇట్లా చెప్పబడింది :

శ్లో॥ త్వదీయలజ్జాద్వయజాపకత్వాద్భవేన్మహేశాని చతుర్థసిద్ధిః ।
దయాసముద్రస్య వరప్రసాదాద్భువాధిపత్యం లభతే నరేశః ॥

ఈ బీజదేవతారూపం ఈవిధంగా వర్ణింపబడింది : ప్రసిద్ధిగా ఈమె త్రిపురసుందరీదేవి. రూపవర్ణనలో ప్రయోగింపబడిన పదబంధాలు మూడు :

1) విగలితచికురే : భౌతికరూపం, జుట్టు విరబోసిన స్త్రీ.

2) సృక్కద్వన్ద్వాస్రధారాద్వయధరవదనే : రెండు పెదవుల చివరనుండి కారుచున్న రెండు రక్తధారలుగల ముఖంతో ఉన్న స్త్రీ.

ఈ రెండున్నూ భౌతికంగా అప్రసన్నదర్శనాలు. ఈ రెండు రూపాలకు సాంకేతికంగా అర్థం చెప్పుకుంటే, ఆ దేవి ఆనందమయ నిర్వికారత్వం దర్శితం. పెదవులనుండి స్రవించే రక్తధారలు రజోగుణసంకేతంగాను, ముక్తకేశబంధం బంధముక్తికి ప్రతీకలు, కాగా

3) దక్షిణే కాలికేతి : (దక్షిణే) కాలికా + ఇతి = కాలికేతి, అనుకుంటే, ఇక్కడి దక్షిణే శబ్దాన్ని 2వ పాదంలోని కాలికే శబ్దంతో అనుసంధానం చేసి సంబోధనగా దక్షిణకాళికా అన్న అర్థాన్ని చెప్పుకోవాలి. అప్పుడు శ్లోకం చివరగల 'కాలికేతి' అన్నదానిని కాలికా + ఇతి అని విభజించి కాళికయని, అని అర్థం చెప్పవచ్చు. కాక కాలికేఽతి అని అవగ్రహంతో పాఠం చేస్తే, **కాలికే అతి = అతికాలికే** అన్న సంబోధనపాఠం మరొకటి యేర్పడుతుంది. అర్థాత్, శ్యామవర్ణచిహ్నితమైన తమోగుణము నతిక్రమించి సత్త్వగుణంతో ప్రకాశించే చైతన్యస్వరూపిణి అవుతుంది. ఈ మూర్తి త్రిగుణాత్మకమున్నూ త్రిగుణాతీతమున్నూ అనవచ్చు. దక్షిణకాళికా అన్నదానిలో దక్షిణ శబ్దానికి సాధకానుకూలత ఈ మూర్తి శీలంగా చెప్పబడింది. కాలిక శబ్దాన్ని విభాగం చేసి, ఆయా విభాగార్థాలను పరిశీలిస్తే, కాలికా = క్ + ఆ, ల్ + ఇ, క్ + ఆ. వీనిలో కకారానికి బ్రహ్మ, లకారానికి విశ్వాత్మ, 'ఆ'కారానికి అనంతము, ఇకారానికి సూక్ష్మత్వము, సంకేతార్థాలుగా చెప్పబడినవి. సమన్వయార్థంలో, సాంకేతికంగా, కాలికాదేవి ఆద్యంతరహిత అనంతా, సూక్ష్మా, విశ్వాత్మికా, పరబ్రహ్మస్వరూపిణీదేవతా.

దక్షిణకాళికా నామప్రశస్తిగా మహానిర్వాణతన్త్రంలో

శ్లో॥ దక్షిణస్యాం దిశి స్థానే సంస్థితశ్చ రవేస్సుతః ।
కాలో నామ్నా పలాయేత భీతియుక్తస్సమన్తతః ।
అతస్సా దక్షిణా కాలీ త్రిషు లోకేషు గీయతే ॥

దక్షిణదిక్కున కధిపతియైన యముడు కాళీనామాన్ని విన్నంతనే పారిపోతాడు కనుక ముల్లోకాలలోను ఆమెకు దక్షిణకాళికా అని పేరు కలిగింది, అని యున్నది. ఇదికాక, **కామాఖ్యాతన్త్రం**లో,

శ్లో॥ యథా కర్మసమాప్తౌ చ దక్షిణా ఫలసిద్ధిదా ।
తథా ముక్తిరసౌ దేవీ సర్వేషాం ఫలదాయినీ ।
అతో హి దక్షిణా కాలీ కథ్యతే వరవర్ణిని ॥

కర్మసమాప్తి కాగానే యే విధంగా కర్మఫలాన్ని దక్షిణరూపంలో ఇస్తుందో, అదేవిధంగా ఈ దేవి అందఱకూ కర్మసమాప్తిలో ముక్తిఫలాన్ని ప్రసాదిస్తుంది. ఆ కారణంగా ఆమెను దక్షిణకాళికా అంటారు, అనిన్నీ,

శ్లో॥ పురుషో దక్షిణః ప్రోక్తో వామా శక్తిర్నిగద్యతే ।
వామా సా దక్షిణం జిత్వా మహామోక్షప్రదాయినీ ।
తతస్సా దక్షిణా నామ్నా త్రిషు లోకేషు గీయతే ॥

పురుషుడు దక్షిణుడనియు శక్తి వామయనియు చెప్పబడుతూన్నది. ఆ శక్తి పురుషుని జయించి మోక్షాన్ని ప్రసాదిస్తుంది కనుక ఆమెకు దక్షిణ అన్నపేరు ముల్లోకాలలో ప్రసిద్ధమైనది. ఇక్కడ పురుషశబ్దానికి జీవుని కర్తృత్వాహంకారం అర్థంగా చెప్పాలి. (వ్యాకరణంలో పురుషశబ్దానికి కర్త అనే అర్థం కదా) శక్తి అహంకారాన్ని నియంత్రించి కర్తృత్వబంధాన్ని తొలగించటంద్వారా కర్మవిమోచనాన్ని కలిగిస్తుందని భావం.

శ్లో॥ నిర్గుణః పురుషః కాల్యా సృజ్యతే లుప్యతే యతః ।
అతస్సా దక్షిణా నామ్నా త్రిషు లోకేషు గీయతే ॥

నిర్గుణుడైన పురుషుడు కాళిచేత సృజింపబడుతూ, నశింపజేయబడుతూ ఉంటాడు కనుక ఆ కాళికి దక్షిణ అని పేరు. నిర్గుణపురుషుడు పరబ్రహ్మ, పరమకర్త, పరమపురుషుడు. వానిని ప్రాకృతపురుషునిచేసి, కర్మబద్ధుని చేసి, మరల మోక్షమిచ్చి నిర్గుణుని నిష్కర్ముని చేసే శక్తిస్వరూపిణి కనుక ఆ కాళీమాతకు దక్షిణయని పేరు.

**హ్రీం హ్రీం దక్షిణకాలికాయై నమః ।**

ఈ మూడు శ్లోకాలున్నూ మూడు బీజాక్షరాలనూ వాని దేవతా స్వరూపాలనూ ఉపాసనా ఫలాలనూ గూర్చి ప్రసంగించినవి. ఈ వివరాలు : శ్లో.1లో **క్రీం** బీజం, దేవత కాళీ; శ్లో.2 లో **హూం** బీజం, దేవత తారా; శ్లో.3లో **హ్రీం** బీజం, దేవత త్రిపురసుందరి. అయినప్పటికిన్నీ ఉపాసకుడు కాళీదేవతనే లక్ష్యం చేసి ఈ బీజాక్షరాలను జపం చేయవలె. భేదభావంతో ఉపాసన అనర్థదాయకం. ఈ మూడు బీజదేవతలకున్నూ అభేదత్వం **ఉత్తరతారారహస్యంలో** చెప్పబడింది :

శ్లో॥ యథా కాలీ తథా తారా తథా నీలసరస్వతీ ।
సర్వాభీష్టఫలప్రదా తథా త్రిపురసున్దరీ ।
అభేదమతమాస్థాయ యః కశ్చిత్సాధయేన్నరః ।
త్రిలోకే స తు పూజ్యః స్యాత్ తారాపుత్రశ్చ ఏవ సః ।
భేదం కృత్వా యదా మన్త్రీ సాధయేదత్ర సాధనమ్ ।
న తస్య నిష్కృతిర్దేవి నిరయే పచ్యతే హి సః ॥

కాళీ, తారా, నీలసరస్వతీ, త్రిపురసుందరీ, అందఱు అభేదమే, అందఱు

సర్వాభీష్ట ఫలప్రదలే. కనుక వారియందు మనసులో నెట్టి భేదమును చూడక, అభేదరూపమును ప్రతిష్ఠించి ఏ నరుడు సాధన చేయునో అతడు సాక్షాత్ తారాపుత్రుడే అగును, ముల్లోకములలో పూజ్యుడగును. భేదభావమున సాధనచేయు మన్త్రసాధకుడు నరకాగ్నిలో పచనము చేయబడును, వానికి నిష్కృతి లేదు.

కాళీమాతకు రెండు భేదాలు చెప్పబడినవి : 1.కృష్ణకాలీ, 2. రక్తకాలీ. ఈ ఇద్దరిలో కృష్ణకాలికే దక్షిణకాలికా అని కూడా పేరు. కాగా, రక్తకాలికే మరియొక పేరు త్రిపురసుందరీ :

శ్లో॥ కాలికా ద్వివిధా ప్రోక్తా కృష్ణా రక్తా ప్రభేదతః ।
కృష్ణా తు దక్షిణా ప్రోక్తా రక్తా తు సున్దరీ మతా ॥

**– బృహన్నీలతన్త్రమ్**

రక్తకాళి లేక త్రిపురసుందరి, వర్ణాన్నిబట్టి, రజోగుణప్రధానదేవత. కనుకే ఆమెకు త్రిపురాసురుల స్వర్ణరజతలోహపురాల సంబంధం చెప్పబడింది. ఆ పురాలు (అనగా స్థూల సూక్ష్మకారణదేహాలు) నశించగా ఆమె సత్త్వగుణుడైన (శ్వేతవర్ణ) శివునిలో చేరినది.

కృష్ణకాళి, వర్ణాన్ని బట్టి, తమోగుణప్రధాన దేవత. తమోగుణం మోహాన్నీ దుఃఖాన్నీ, అలసత్వాన్నీ, అజ్ఞానాన్నీ, నిద్రనూ, భయదైన్యాలనూ, కార్పణ్య కౌటిల్యాలనూ, రోషవివాదాలనూ కలిగించేదిగా చెప్పబడింది. ఇది కృష్ణవర్ణ ప్రాకృతికస్వభావం. కాని, ఇది పూర్తిగా రజోస్పర్శ లేనిదైతే, త్రిగుణాతీత చైతన్యశక్తి యవుతుంది. ఆ శక్తియే ఉపాస్య.

**క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణకాలికాయై నమః ।**
**క్రీం క్రీం క్రీం కాల్యై నమః । హూం హూం తారాయై నమః ।**
**హ్రీం హ్రీం త్రిపురసుందర్యై నమః ।**



**శ్లో॥ ఊర్ధ్వం వామే కృపాణం కరకమలతలే ఛిన్నముణ్డం తతోఽధః ।**
**సవ్యేఽభీతిం వరం చ త్రిజగదఘహరే! దక్షిణే కాలికే చ ।**
**జప్త్వైతన్నామ యే వా తవ విమలతనుం భావయన్త్యేతదమ్బ!**
**తేషామష్టౌ కరస్థాః ప్రకటితరదనే సిద్ధయస్త్ర్యమ్బకస్య ॥ 4**

**అన్వయక్రమం :** (హే) త్రిజగదఘహరే! (హే) అమ్బ! (హే) ప్రకటితరదనే! యే సాధకాః దక్షిణే కాలికే! చ (ఇతి) ఏతన్నామ వా జప్త్వా వామే కరకమలతలే ఊర్ధ్వం కృపాణం తతః అధః ఛిన్నముణ్డం సవ్యే (కరకమలతలే) ఊర్ధ్వమ్ అభీతిం తతః అధః వరం చ (ఇతి) ఏతత్ తవ విమలతనుం భావయన్తి తేషాం కరస్థాః త్ర్యమ్బకస్య అష్టౌ సిద్ధయః భవన్తి ।

**ప్రతిపదార్థం :** (హే) త్రిజగద్ = మూడులోకముల, అఘ = పాపమును, హరే = పోగొట్టుదానా!, (హే) అమ్బ = ఓ తల్లీ!, (హే) ప్రకటిత = ప్రదర్శింపబడిన, రదనే = పలువరుస కలదానా!, యే సాధకాః = ఏ సాధకులు, దక్షిణే కాలికే = ఓ దక్షిణకాళికా, (ఇతి) చ = అనియును, ఏతద్ నామ వా = ఈ పేరును కూడ, జప్త్వా = జపించి, వామే కరకమలతలే = ఎడమచేతియందు, ఊర్ధ్వమ్ = పైకెత్తబడిన, కృపాణమ్ = ఖడ్గమును, తతః = ఆ తరువాత, అధః = క్రింది చేతిలో, ఛిన్న = త్రుంచబడిన, ముణ్డమ్ = తలను, సవ్యే = కుడి (కరకమలతలే = చేతి)యందు, ఊర్ధ్వమ్ = పైన, అభీతిమ్ = అభయముద్రను, తతః = ఆపై, అధః = క్రింది (చేతిలో) వరమ్ = వరదముద్రను, చ = కూడ కలిగియున్న, ఏతద్ = ఈవిధమైన, తవ = నీయొక్క, విమలతనుమ్ = నిర్మలమైన సాకారమూర్తిని, భావయన్తి = ధ్యానింతురో, తేషామ్ = వారికి, త్ర్యమ్బకస్య = ముక్కంటియొక్క, అష్టౌ సిద్ధయః = ఎనిమిది సిద్ధులు, కరస్థాః = చేతనున్నవి, భవన్తి = అగుచున్నవి.

**తాత్పర్యం :** మూడు లోకముల పాపములను తొలగించు పుణ్యకాంతులీను పలువరుస గల ఓ తల్లీ, దక్షిణకాళికా! అని నీ నామమును జపించుచు, ఎడమవైపు పై చేత పైకెత్తబడిన ఖడ్గమును బట్టి, క్రింది చేత త్రుంచబడిన తలను బట్టి, అట్లే కుడివైపు పై చేత అభయముద్రను, క్రింది చేత వరదముద్రను ప్రదర్శించుచున్న నీ నిర్మలమైన చతుర్భుజరూపమును మనసున భావింతురో ఆ భక్తులకు ముక్కంటి శివుని అధీనమందున్న అష్టసిద్ధులు వశమగుచున్నవి.

ఈ శ్లోకంలో **దక్షిణకాలికారూపవర్ణన** యున్నది కాని పై శ్లోకాలలో చెప్పబడినట్లు వేరొక బీజాక్షరము తదుద్ధారప్రసక్తి లేదు. ఉపాసనాఫలప్రసంగమున్నది. కాగా క్రీం హూం హ్రీం బీజత్రయమే జపించదగినవి, వానికి వేర్వేరు దేవతా రూపములున్ననూ, అన్నిటికి లక్ష్యదేవత దక్షిణకాళిక మాత్రమే యని ముందే చెప్పబడినది. భేదబుద్ధి వినష్టదాయకమని హెచ్చరికయు చేయబడినది. ఈ శ్లోకమున వర్ణింపబడిన రూపముగూడ దేవతాభేదముగ పరిగణించరాదు. దక్షిణకాళీదేవతయే లక్ష్యము.

ఈ శ్లోకంలో కవి దక్షిణకాళికను మాతృభావన చేసి, అంబ అని సంబోధిస్తూ ఆ అమ్మరూపశీలవర్ణన చేసినాడు. ఆమె చతుర్భుజ : ఎడమ చేతులు రెండు : ఒకటి పైది, ఒకటి క్రిందిది. పై ఎడమచేతిలో పైకెత్తి పట్టిన ఖడ్గమున్నది. కాని ఈ ఖడ్గం కృపాణం. ఈ శబ్దం సార్థకం. **కృపణస్య కృపాణస్య చ కేవలమకారతో భేదః** అన్న సుభాషితోక్తిని స్మరించి, రెండిట 'కృప'ను గమనించి, కవి ఆ శబ్దాన్ని ప్రయోగించటంలోని ఔచిత్యాన్ని గ్రహించవచ్చు. **కృపణు**డంటే, నిరుపేద, దయనీయస్థితిలో ఉన్నవాడు, యే సహాయము లేనివాడు, అనిశ్చితబుద్ధి, వివేకహీనుడు, అల్పుడు, పిసినారి (పిశునః), అన్న అర్థాలు శబ్దార్థకోశాల్లో లభిస్తాయి. కృపాణమంటే కత్తి, ఖండించే ఖడ్గం. ఇది నాశనం చేసే శక్తికి ప్రతీక. దేన్ని నాశనం చేస్తుంది? అన్న ప్రశ్నకు సమాధానం, ఆ ఖడ్గశక్తిని ధరించినవారి శీలంపై ఆధారపడి ఉంటుంది. ప్రస్తుతం అది దక్షిణకాళిక వామహస్తంలో, ఊర్ధ్వంలో, ఊర్ధ్వముఖంగా ఉన్నది. అది ఆమె సంసిద్ధతను తెలియజేసే భంగిమ. ఆ సంసిద్ధతకు వెనుబలం ఆమె మాతృత్వం. కనుక తన బిడ్డల నిస్సహాయతను, అది ఎటువంటిదైనప్పటికి, నిర్మూలించే నిమిత్తంగా **కృప** అన్న ఖడ్గాన్ని కలిగియున్నదా తల్లి (అంబ). **కృపా** శబ్దానికి ద్వితీయగణ పరస్మైపది ధాతువు **అన్** కలిస్తే **కృపాన** లేక **కృపాణ** అవుతుంది. ఈ ధాతువుకు జీవించుట అని అర్థం. కృపతో జీవించేది మాతృశీలం. ఈమె కృపాణం మూడు లోకాల పాపాలను హరించేది, అనగా, దేవ దానవ మానవుల పాపాలను హరించి అందఱిని హృదయానికి హత్తుకునే తల్లి (త్రిజగదఘహరే) ఘోరపాపులైన దానవులను సైతం, వారిని హతమార్చి, ఆత్మతేజస్సులను తనలో లీనం చేసికొనే కథలు పురాణప్రసిద్ధాలు. త్రిజగత్తులలోనూ, ఎవరు యెవరు యే పాపం చేసినా, అది రూపంలో త్రివిధంగా ఉంటుంది : 1) కాయికం, 2) వాచికం, 3) మానసికం. ఇవి మూడున్నూ మూడు జగత్తులు. సాధారణంగా ఈ మూడింట విడివిడిగా ప్రవర్తిస్తూ జీవిస్తూంటారు దేవదానవ మానవులు. మిగతావారి మాట ఎట్లాగున్నా, మన సంగతి మనకు తెలుసుకదా. అందుకే అన్నాడు వేమన :

ఆ.వె. మాటలాడు టొకటి, మనసులో నొక్కటి,
ఒడలి గుణము వేఱె, ఓజ వేఱె;
ఎట్లు ముక్తి కలుగు నీలాగు తానుండ?
విశ్వదాభిరామ వినుర వేమ.

శరీరంతోను, మాటలతోను, మనస్సుతోను చేసే పాపాలను హరించే కృపామతి ఈ కృపాణధారిణి. పాపమనే చీకట్లను పారదోలే విధంగా శుభ్రవర్ణంతో వెలిగే ఆ తల్లి పలువరుస తమోనాశిని, సత్త్వమయి, అన్నదే **ప్రకటితరదనే** అన్న సంబోధన. ఈ కృపాఖడ్గ క్రియను సూచించేదే ఎడమచేయి క్రిందిదానిలోని **ఛిన్నముణ్డం**. ఇట్లీమె వామపక్షం అభేదకృపాపరతకు, పాపమోచకతకు ప్రతీకగా దర్శనమిస్తుంది.

ఆమె దాక్షిణ్యం అభయప్రదత్వాన్నీ వరప్రదత్వాన్నీ ముద్రలుగా పట్టి దర్శనమిస్తుంది. ఈ రెండున్నూ ఆమె వామత్వానికి ప్రతిరూపాలు. **వామా** శబ్దానికి గౌరి, లక్ష్మి, సరస్వతి అన్న అన్వయమున్నది. కాగా ఈ దక్షిణకాళిక ముగ్గురమ్మల శీలము కలదని సూచన.

ఈ దేవత రూపచిత్రణలో తెల్లని పలువరుస, ఎఱ్ఱని ఛిన్నమస్తకం, కాళిక యన్న పేరులోనే నలుపు, మూడున్నూ సత్త్వరజస్తమోగుణాలకు ప్రతీకలు. కనుక ఈ తల్లి త్రిగుణాత్మిక. ఐనప్పటికి, ప్రకటితరదనే అనటంలో ఈమె తమోనాశిని, సత్త్వప్రకాశిని యని వ్యంజితం. విమలతనుం అనటం ఈ భావానికి పూరకం. మాతృకృపావాత్సల్యంలో ఈ శరీరశ్యామవర్ణం విమలమైపోయినది.

ఈమెను దక్షిణకాళికారూపిణిగా భావించి జపించినట్లయితే మూడు కన్నుల దేవుని వశవర్తులైన అష్టసిద్ధులు ఆ ఉపాసకుని కరతలామలకములవుతవి, అన్నది ఫలం. ఆ అష్టసిద్ధుల స్వరూపాలివి :

1) **అణిమా :** దేహ పరిమాణం చిన్నదిగా, అణువంతగా కూడ తగ్గిపోవటం.

2) **మహిమా :** చిన్నదైన శరీరం పెద్దదిగా మహాకాయం కావటం.

3) **గరిమా :** శరీరభారం కొండంతగా పెరిగిపోవటం.

4) **లఘిమా :** శరీరం దూదిపింజవలె తేలికయైపోవటం.

5) **ప్రాప్తి :** చేరరానంత దూరానగల వస్తువుకూడ అందుకోగలిగినంతగా తన శరీరాంగాన్ని పెంచటం ద్వారా తానున్న చోటనే ఉండి పొందటం.

6) **ప్రాకామ్యం :** ప్రకృతిపై నిరోధంలేని అధికారాన్ని పొందటం.

7) **ఈశిత్వం :** ముందు చెప్పబడిన ఆరుసిద్ధులను మరొకరియందు గూడ కలిగించగల శక్తి.

8) **వశిత్వం :** ప్రబలమైనదానిని / వానిని కూడ తాను కోరినట్లు చేయించు వశీకరణ శక్తి.

ఈ ఎనిమిది శక్తులకు అధిపతి శివుడు, బేసికన్నుల దేవుడు, త్రి+అంబక = త్ర్యంబక అనునది ముక్కంటి పేరు. ఈ పదానికి అనేక విధాలుగా అర్థం వివరించ బడినది: **శివపురాణంలో**

జ్ఞానక్రియేచ్ఛారూపం హి శంభోర్దృష్టిత్రయం విదుః ।

అనగా, జ్ఞానము, క్రియ, ఇచ్ఛా అను మూడున్నూ ఆ దేవుని మూడు కన్నులని చెప్పబడినది. సూర్యుడు, చంద్రుడు, అగ్ని అను మూడు ఆ కన్నులని మహానిర్వాణ తన్త్రం, బ్రహ్మ విష్ణు రుద్రులకు తండ్రి కనుక త్ర్యంబకుడనుపేరు కలిగినట్లు స్కందపురాణం, ఇట్లా వివిధంగా చెప్పబడినది. ఈ దేవుడు మెచ్చినప్పుడే వీని వశమందున్న ఈ సిద్ధులెవరికైన లభించగలవు. దక్షిణకాళికామాతను మెప్పించి వీనిని పొందవచ్చునంటే, ఈ దేవతకూ ఆ దేవునకూ అభేదమనియే కదా భావము.

శ్లోకంలో **జప్త్వా భావయన్తి** అని యున్నదానిపై శంకయొకటి కలుగక మానదు. జపించుట భావించుట యనునవి రెండు క్రియలు. రెండున్నూ మనస్సంబంధులే. మనస్సు లగ్నము కాకున్న జపమాగిపోవును. జపించు మన్త్రమందు మనసు నుంచిన సాధకునకు మంత్రాధిదేవతరూపము మనసున నిల్చుట కష్టము. రూపముపై చిత్తము నిల్పినచో, మంత్రజపము ఆగిపోవును. ఏలన, ఇంద్రియములన్నియు మనస్సు ననుసరించు స్వభావము కలవి. అవి తమంత తాము జడములే. వానిని ప్రవర్తింపజేయునది మనస్సు. కనుక ఈ సందిగ్ధస్థితి యేర్పడుట సహజము. దీనికి శివపురాణోక్తి పరిష్కారమిది :

శ్లో॥ జపాత్ శ్రాన్తః పునర్ధ్యాయేత్ ధ్యానాత్ శ్రాన్తః పునర్జపేత్ ।
జపధ్యానాభియుక్తస్య క్షిప్రం యోగః ప్రసిధ్యతి ॥

జప్త్వా = జపించి, భావయన్తి = ధ్యానించుచున్నారు, అనటంలో **జప్త్వా** రూపం దీన్ని సమర్థిస్తున్నదనవచ్చు. **కౌలావలీతన్త్రం** కూడా

శ్లో॥ జపస్యాదౌ శివాం ధ్యాయేత్ ధ్యానస్యాన్తే పునర్జపేత్ ।

అంటూ జపధ్యానాలు రెండున్నూ ఒకదాని వెంట నొకటి పరస్పరపూరకాలుగా సాగవలెననియే నిర్దేశిస్తున్నది. అసలు, జప్త్వా = జపించి, అన్న రూపం అసమాపకం,

కనుక జపించిన తరువాత మరేదో చేయవలసినది ఉన్నదని సూచిస్తున్నది కనుక జపించుట ధ్యానించుట కలిసి ఒక ఆవృత్తిగా సాగవలెననుటయే సరి, అన్నది అటుండగా, జపధ్యానాలు కలిసియే సాధన సాగవలె నన్నదొక వాదము. 'కనులు మూసికొని నిద్రించెను' అన్న వాక్యంలో కనులు మూసికొనుట నిద్రాక్రియలో అంతర్లీనమైనదే కనుక రెండున్నూ కలిసిన క్రియ నిద్రించుటయైనట్లు, 'జప్త్వా భావయన్తి' అనటంలోనూ జపము ధ్యానాంతర్గతమున్నూ ధ్యానము జప ప్రయోజనమున్నూ అవుతుంది కనుక రెండూ కలిపి ఒకే క్రియగా భావించవలెనన్నది తర్కము. రెండు క్రియలే కాదు, అనేక వివిధ క్రియలు ఒకేసారి జరగటం అసహజం కాదు. కాని సాధకునికి ప్రాథమికావస్థలో కష్టతరమే. మనస్సువలె కాలమున్నూ సూక్ష్మము, అతి సూక్ష్మము కూడ. ఈ కారణంగా లౌకిక కార్యకలాపాలు ఒకే సమయంలో అనేకం జరిగినట్లనిపించుట ప్రాకృతికానుభవం. కాని మనఃకాలాల సూక్ష్మతను పరిగణించినప్పుడు సత్యము భిన్నముగ గోచరించును. కాలవివేచన చేస్తే, మన అనుభవ పరిభాషకు సాధ్యమైనంత సామీప్యస్థితిలో,

1/4 నిమేషము (ఱెప్పపాటు) = 1 తృటి = 1/147000 సెకనులు.
2 తృటిలు = 1 లవము = 1/73500 సెకనులు
2 లవములు = 1 యవ = 1/36750 సెకనులు
15 యవలు = 1 కాష్ఠా = 1/2450 సెకనులు
30 కాష్ఠలు = 1 కళ = 1/75 సెకనులు
30 కళలు = 1 క్షణము = 2/5 సెకనులు
30 క్షణములు = 1 పలము = 24 సెకనులు
60 పలములు = 1 నాడికా = 24 మినిట్స్
2 నాడికలు = 1 ముహూర్తము = 48 మినిట్స్
30 ముహూర్తములు = 1 దినము
30 దినములు = 1 మాసము
2 మాసములు = 1 ఋతువు
3 ఋతువులు = 1అయనము
2 అయనములు = 1 వర్షము
4320000 వర్షములు = 1 చతుర్యుగము
1000 చతుర్యుగములు = 1 బ్రహ్మదినము
1000 చతుర్యుగములు = 1 బ్రహ్మరాత్రము

2000 చతుర్యుగములు = 1 కల్పము

ఇది భారతీయ ఆర్షసాంప్రదాయిక కాలవివేచన. స్లో మోషన్ లో, ఈ విభాగం దృష్ట్యా, మనస్సు ఏకకాలంలో జపధ్యానాలు, అనగా మంత్రాక్షర దేవతారూపాలు, రెండిటిపై లగ్నం కావటం సాధకునికి అసాధ్యంగా కనిపిస్తుంది. కాని సాధన సాగిన కొలది సాధ్యమవుతుందని, ఆవిధంగా మంత్రానికి మంత్రాధిదేవతకు పూర్ణాభేదదర్శనంలోనే సిద్ధియన్నది ఇమిడియున్నదని యోగుల మతం.

కర్మేంద్రియాలకూ జ్ఞానేంద్రియాలకూ యజమాని మనస్సే అయినప్పటికి, మనస్సు వేగానికీ కర్మేంద్రియవేగానికీ ఉన్న వ్యత్యాసంవలన జపవిధిలో వాచికజపం, ఉపాంశుజపం, మానసికజపం అని మూడు భేదాలేర్పడుతూన్నవి. వాచికజపం మంత్రాన్ని స్పష్టంగా వినగలిగేట్లు ఉచ్చరించటం. ఉపాంశుజపం మంత్రాన్ని అస్పష్టంగా గుసగుసలాడుతూన్నట్లు పలకటం. మానసికజపం పూర్తిగా నిశ్శబ్దంగా చేసే మంత్రజపం. ఈ మూడు విభాగాల పరస్పర సంబంధం **కౌలావలీతన్త్రం**లో ఇట్లా చెప్పబడినది.

శ్లో॥ మనసా మన్త్రవర్ణస్య చిన్తనం మానసం స్మృతమ్ ।
వాచికస్య శతం జ్ఞేయం ఏకోత్తరముపాంశునా ।
తస్మాత్ శతగుణం ప్రోక్తం మానసం జపముత్తమమ్ ॥

వాచికజపం 100 సార్లు చేస్తే, అది ఒక ఉపాంశుజపంతో సమానం. అట్లే ఉపాంశుజపం 100 సార్లు చేస్తే, అది ఒక మానసికజపంతో సమానమవుతుంది. ఈ ముప్విధాలలో మానసికజపమే సర్వోత్తమం.



**శ్లో॥ వర్గాద్యం వహ్నిసంస్థం విధురతిలలితం తత్త్రయం కూర్చయుగ్మం**
**లజ్జాద్వన్ద్వం చ పశ్చాత్ స్మితముఖి! తదధష్ఠద్వయం యోజయిత్వా ।**
**మాతర్యే త్వాం జపన్తి స్మరహరమహిలే! భావయన్తః స్వరూపం**
**తే లక్ష్మీలాస్యలీలాకమలదలదృశః కామరూపా భవన్తి ॥ 5**

**అన్వయక్రమం :** (హే) స్మితముఖి! (హే) మాతః! (హే) స్మరహరమహిలే! వహ్నిసంస్థం విధురతిలలితం వర్గాద్యం తత్ త్రయం, తతః కూర్చయుగ్మం, తత్ పశ్చాత్ లజ్జాద్వయం చ తదధః ఠద్వయం యోజయిత్వా యే (సాధకాః) స్వరూపం భావయన్తః జపన్తి, తే (సాధకాః) లక్ష్మీలాస్యలీలాకమలదలదృశః కామరూపాః భవన్తి ।

**ప్రతిపదార్థం :** (హే) స్మితముఖి = ఓ నగుమోముగలదానా!, (హే) మాతః = ఓ తల్లీ!, (హే) స్మరహరమహిళే = ఓ మన్మథుని దహించిన శివుని ప్రియురాలా!, వహ్నిసంస్థమ్ = రకారమును, విధురతిలలితమ్ = బిందుసహితమైన దీర్ఘ ఈకారముతో, వర్గాద్యమ్ = మొదటి వర్గపు మొదటిదైన కకారముతో, (కలిసిన) తత్ త్రయమ్ = ఈ మూడిటిని (అనగా క్రీం), తతః = తరువాత, కూర్చయుగ్మమ్ = కూర్చబీజమైన హూం జంటను (అనగా హూం హూం), తత్ పశ్చాత్ = అటు తరువాత, లజ్జాద్వయమ్ = లజ్జాబీజమైన హ్రీం జతను (హ్రీం హ్రీం అని), చ = మరియు, తదధః = దాని తరువాత, ఠద్వయమ్ = స్వాహా శబ్దమును, యోజయిత్వా = చేర్చి, యే = ఎవరు, స్వరూపమ్ = స్వరూపమును, భావయన్తః = ధ్యానించుచున్నవారై, జపన్తి = జపించుచున్నారో, తే = వారు, లక్ష్మీ = లక్ష్మీదేవియొక్క, లాస్య = విలాస, లీలాకమలదల = క్రీడాకమలదల, దృశః = సమానులైన, కామరూపాః = కామరూపులు, భవన్తి = అగుచున్నారు.

**తాత్పర్యం :** మన్మథుని దహించిన శివుని ఇల్లాలవైన నగుమోముగల తల్లీ! రకారమును బిందుసహితమైన ఈకారమును కకారముతో కూర్చగా వచ్చిన క్రీం బీజమును, దానితో కూర్చబీజమైన హూం కారమును, ఆపై లజ్జాబీజమైన హ్రీంకారమును, క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం అని జపించి దానిని స్వాహా శబ్దముతో చేర్చి నీ స్వరూపమును ధ్యానించువారు లక్ష్మీదేవి చేతబట్టి విలాసముగ ఆడించు కమలదలముతో సరితూగు కామరూపవిద్యను పొందగలరు.

పైజెప్పినట్లు **క్రీంక్రీంక్రీం హూంహూం హ్రీంహ్రీం దక్షిణే కాలికే క్రీంక్రీంక్రీం హూంహూం హ్రీంహ్రీం స్వాహా** అన్నది సంపూర్ణరూపము. ఇప్పుడు ద్వావింశత్యక్షరీమంత్రంగా పరిపూర్ణమైనది.

ఈవిధంగా **క్రీం** బీజాన్ని మూడుసార్లు ఉచ్చరించటంవలన **చిత్కలాజ్ఞానము, హూం** బీజాన్ని రెండుసార్లు ఉచ్చరించటంవలన **శాబ్దికపరిజ్ఞానము, హ్రీం** బీజాన్ని రెండుసార్లు జపించటం వలన **సృష్టిస్థితిప్రళయకారిణి గూర్చిన జ్ఞానమున్ను** కలిగి ఆ దేవిని సంబోధించటంద్వారా ఆమె సాన్నిధ్యం లభించి, స్వాహా శబ్దప్రయోగంవలన పాతకనాశనం సంభవిస్తుందని **యామలతన్త్రోక్తి.**

ఈ జపం చేసే సమయంలో పూర్వం వర్ణించి చెప్పబడిన స్వరూపభావన చేయవలె. లేదా, మంత్రార్థాన్ని చింతించవలె. అది ఫలించినవానికి కామరూపవిద్య లభిస్తుంది.

చివరి పాదానికి మరొక విధంగానూ అన్వయం చెప్పబడినది, లక్ష్మీదేవి చేతిలోని క్రీడాకమలమును పోలిన సుందరీమణులు అట్టి భక్తుని కామింతురని, మరియొక రీతి అన్వయంలో, లక్ష్మీదేవి లాస్యవిలాసములకు లక్ష్యభూతుడగు విష్ణుదేవునితో సమానమైన శరీరరూపమును కోరి పొందగలడని, సారభూతమైన అర్థం, అట్టి ఉపాసకుని కన్నులలో లక్ష్మీప్రసన్నత, తనువులో సౌందర్యము వర్ధిల్లునన్నది గ్రాహ్యం.

ఈ పాదానికొక ఆధ్యాత్మికార్థం కూడ ప్రతిపాదింపబడింది. దక్షిణకాళికాదేవికి త్రిగుణాత్మకమైన (తత్రయం), తేజోమయ (బ్రహ్మసంస్థితం), చిన్మయ (వర్గాద్యం) రూపధ్యానము చేసిన భక్తునకు, అట్లే, శబ్దబ్రహ్మ (కూర్చయుగ్మం) రూపముగను, మాయావలిత బ్రహ్మరూప (లజ్జాద్వయం) ముగను, ప్రకాశబ్రహ్మ (ఠద్వయం) రూపముగను భావించి, అభేదభావంతో ధ్యానించిన వారికి విష్ణునితో సదృశమైన కామరూపము కలుగును.

ఇట్లా అనేక ఫలప్రదాత కాళీమాత కీర్తింపబడినది. ఆ దేవి నారాధించి లౌకిక పారలౌకిక ప్రయోజనాలు పొందవచ్చు. అయితే, ధ్యానసమయంలో సాధకుడు తనను తాను కాళికగా భావించి తీరవలె. **కాలికోపనిషద్, సర్వదా కాళీరూపమాత్మానం విభావయేత్,** అని స్పష్టంగా పలుకుతూన్నది. నిజానికి బ్రహ్మాండమంతయూ కాళీరూపమనియే భావించి ప్రవర్తించవలె. ఆ దేవతామూర్తి భావన అవయవాత్మక ప్రతిమగా, మన్త్రాత్మకమూర్తిగా, వాసనాత్మకమానసికవిగ్రహంగా, ఈ మూడు విధాలుగానూ చేయవలసియుంటుంది. కనుక భగవతీరూపం స్థూల, సూక్ష్మ, పరములుగా త్రివిధం.

దేవత శరీరం మన్త్రాత్మకం, కనుక దేవతను మంత్రముతోనే వచింపదగును. మంత్రము వాగ్రూపమైనది, దేవత మన్త్రవాచ్యము. కనుక దేవతామంత్రములు వాచ్యవాచకములు, అభేదములు. వాచకమంత్రముయొక్క పరిజ్ఞానమువలన వాచ్యదేవత ప్రసన్నమగును. ఇది జపధ్యాన సాక్షాత్కారముల పరస్పర సంబంధము. అయితే ఇక్కడ మంత్రోపాసనలో, ఈ 22 అక్షరాల మంత్రోచ్చారణలో యే అక్షరానికే అవయవం ప్రతిరూపమన్న శంక కలగటం సహజం. ఆ వివరాల నిట్లా **శాక్తానన్దతరంగిణి** నిర్దేశించి చెబుతూన్నది :

శ్లో॥ క్రీంకారో మస్తకం దేవి, క్రీంకారశ్చ లలాటకమ్ ।
నేత్రత్రయం చ క్రీంకారో హూంకారేణ చ నాసికా ॥

శ్లో॥ హూంకారో ముఖపద్మం స్యాత్ హ్రీంకారః కర్ణయుగ్మకమ్ ।
హ్రీంకారేణ భవేద్గ్రీవా దకారశ్చిబుకం భవేత్ ॥

శ్లో॥ క్షికారేణ భవేద్దన్తో ణేకారేణౌష్ఠయుగ్మకమ్ ।
కాకారేణ స్తనద్వన్ద్వం లికారః పృష్ఠదేశకః ॥

శ్లో॥ కేకారేణ భవేద్బాహుః క్రీంకారేణోదరం భవేద్ ।
క్రీంకారో నాభిదేశః స్యాత్ క్రీంకారశ్చ నితమ్బకః ॥

శ్లో॥ హూంకారో యోనిరూపః స్యాత్ హూంకారేణోరుయుగ్మకమ్ ।
హ్రీంకారో జానుయుగ్మం స్యాత్ హ్రీంకారో గుల్ఫదేశకః ।
స్వాశబ్దేన పదద్వన్ద్వం హాశబ్దైర్నఖరం తథా ॥

ఈ మంత్రానికి **విద్యారాజ్ఞీ** అని విశిష్టనామం. కాలికాశ్రుతి ననుసరించి, బ్రహ్మరూపిణీ మన్త్రమయీ దక్షిణకాళిక సహస్రారచక్రంలో సాక్షాత్కరిస్తుందని చెప్పబడింది. ఈ ద్వావింశత్యక్షరీ విద్యారాజ్ఞీప్రభావమే సృష్టిస్థితిలయముల ఆవృత్తి జరుగుచుండునని నిరుత్తరతన్త్రంలో చెప్పబడినది.

ఈ విద్యారాజ్ఞీ సంపూర్ణ స్వరూపమిది : **క్రీంక్రీంక్రీం హూంహూం హ్రీంహ్రీం దక్షిణేకాలికే క్రీంక్రీంక్రీం హూంహూం హ్రీంహ్రీం స్వాహా॥** ఈ బీజాక్షరాల విపర్యయం చేసి ముందు ప్రణవాన్ని చేరిస్తే, స్వాహా లేకుండ, ఏకవింశత్యక్షరాత్మక కాలికామన్త్ర మవుతుంది. దీని రూపమిది : **ఓం హ్రీం హ్రీం హూం హూం క్రీం క్రీం క్రీం దక్షిణే కాలికే క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం ॥** ఈ 21 అక్షరాల మంత్రం చివర 'స్వాహా' అన్న రెండు అక్షరాలను కలిపితే **త్రయోవింశత్యక్షరీ** మన్త్రరాజ మవుతుంది.

మన్త్రాలలో కూడా స్త్రీ పుం నపుంసక మన్త్రాలన్న భేదాలున్నవి. ఇట్లా, మన్త్రం చివర **'హూం, ఫట్'** అని ఉండేవి పుందేవతామన్త్రాలు. చివర **'స్వాహా'** అని ఉండేవి స్త్రీ దేవతా మన్త్రాలు. చివర **నమః** అని ఉండేవి నపుంసకదేవతా మన్త్రాలు. అయితే పుందేవతా సంబంధమైన వానిని మన్త్రాలనిన్నీ, స్త్రీ దేవతా సంబంధమైనవానిని విద్యలనీ అనటం కద్దు. వినియోగపద్ధతి ఇట్లా నిర్దేశించబడింది:

అస్య శ్రీవిద్యారాజ్ఞీమన్త్రస్య మహాకాల ఋషిః, ఉష్ణిక్ ఛన్దః దక్షిణకాలికా దేవతా, హ్రీం బీజమ్, హూం శక్తిః, క్రీం కీలకమ్, పురుషార్థచతుష్టయసిద్ధయే

తత్తత్కామనాసిద్ధయే వా, భగవతీ శ్రీ దక్షిణకాలికాప్రీత్యర్థం వా జపే వినియోగః ।

అంగుష్ఠేన శిరసి – ఓం మహాకాలాయ నమః ।
మధ్యమానామికాభ్యాం ముఖే – ఓం ఉష్ణిక్ ఛందసే నమః ।
అంగుష్ఠరహితాంగులీభిః హృదయే – శ్రీమద్దక్షిణకాలికాయై దేవతాయై నమః ।
సంలగ్నాంగుష్ఠానామికారూపతత్వముద్రయా గుహ్యే – ఓం హ్రీం బీజాయ నమః ।
మధ్యమాంగుల్యా పదద్వయే – ఓం హూం శక్తయే నమః ।
హస్తద్వయతలయోః సర్వాంగే – ఓం క్రీం కీలకాయ నమః ।

**కరన్యాసము :** ఓం క్రాం అంగుష్ఠాభ్యాం నమః । ఓం క్రీం తర్జనీభ్యాం స్వాహా । ఓం క్రూం మధ్యమాభ్యాం వషట్ । ఓం క్రైం అనామికాభ్యాం హుం । ఓం క్రౌం కనిష్ఠాభ్యాం వౌషట్ । ఓం క్రః కరతలకరపుష్ఠాభ్యాం ఫట్ ।

**అంగన్యాసము :**

ఓం క్రాం హృదయాయ నమః, ఇతి తర్జనీమధ్యమానామికాభిర్ హృదయే న్యసేత్ ।
ఓం క్రీం శిరసే స్వాహా, ఇతి తర్జనీమధ్యమాభ్యాం శిరసి న్యసేత్ ।
ఓం క్రూం శిఖాయై వషట్, ఇతి ముష్టిబద్ధహస్తాంగుష్ఠేన శిఖాయాం న్యసేత్ ।
ఓం క్రైం కవచాయ హుం, ఇతి హస్తద్వయసర్వాంగులీభిః సర్వాంగే న్యసేత్ ।
ఓం క్రౌం నేత్రత్రయాయ వౌషట్, ఇతి తర్జనీమధ్యమానామికాభిః నేత్రత్రయే న్యసేత్।
ఓం క్రః అస్త్రాయ ఫట్, ఇతి దక్షహస్తతర్జనీమధ్యమాభ్యాం వామహస్తతలే తాలత్రయం దద్యాత్ ।

**క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణే కాలికే**
**క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా ॥**



**శ్లో॥ ప్రత్యేకం వా ద్వయం వా త్రయమపి చ పరం బీజమత్యన్తగుహ్యం**
**త్వన్నామ్నా యోజయిత్వా సకలమపి సదా భావయన్తో జపన్తి ।**
**తేషాం నేత్రారవిన్దే విహరతి కమలా వక్త్రశుభ్రాంశుబిమ్బే**
**వాగ్దేవీ దేవి! ముణ్డస్రగతిశయలసత్కణ్ఠి! పీనస్తనాఢ్యే! ॥ 6**

**అన్వయక్రమం :** (హే) దేవి! (హే) ముణ్డస్రగతిశయలసత్కణ్ఠి! (హే) పీనస్తనాఢ్యే! యే ప్రత్యేకం వా ద్వయం వా త్రయం చాపి అత్యన్తగుహ్యం పరం బీజం త్వన్నామ్నా

యోజయిత్వా సకలమ్ అపి భావయన్తః సదా జపన్తి తేషాం నేత్రారవిన్దే కమలా (విహరతి) వక్త్రశుభ్రాంశుబిమ్బే వాగ్దేవీ చ విహరతి ॥

**ప్రతిపదార్థం :** (హే) దేవి = ఓ దేవీ!, (హే) ముణ్డస్రగ్ = శిరసులమాలతో, అతిశయ లసత్ = అతిశయించి ప్రకాశించుచున్న, కణ్ఠీ = కంఠము గలదానా!, (హే) పీనస్తనాఢ్యే = బలిసిన స్తనములతో విరాజిల్లుదానా!, యే = ఎవరు, ప్రత్యేకమ్ = ఒక్కటిగ, వా = లేక, ద్వయమ్ = రెండుగ, వా = లేక, త్రయం చ అపి = మూడుగనైనను, అత్యన్తగుహ్యామ్ = పరమరహస్యమైన, పరం బీజమ్ = పర(మ) బీజమును, త్వద్ = నీయొక్క, నామ్నా = పేరుతో, యోజయిత్వా = జతగూర్చి, సకలం అపి = అన్ని అంశలను, భావయన్తః = ధ్యానించుచున్నవారై, సదా = ఎల్లప్పుడు, జపన్తి = జపించుచున్నారో, తేషామ్ = వారియొక్క, నేత్రారవిన్దే = పద్మములవంటి కనులలో, కమలా = లక్ష్మీదేవి, వక్త్ర = ముఖమనెడు, శుభ్ర = నిర్మలమైన, అంశుబిమ్బే = సూర్యబింబమున లేక చంద్రబింబమున, వాగ్దేవీ = సరస్వతి, చ = కూడ, విహరతి = విహరించుచున్నది.

**తాత్పర్యం :** ఓ దేవీ! కపాలమాలాధరీ! పీనపయోధరీ! నీ శక్తిబీజములలో యే ఒక్కదానిని గాని, యే రెండిటినిగాని, లేక మూడిటినీగాని నీ పేరుతో చేర్చి నీ అంశలన్నింటిని ధ్యానించు భక్తుల కన్నులలో లక్ష్మియు, ముఖమున సరస్వతియు విహరించుచున్నారు.

క్రీం, హూం, హ్రీం అన్నవి మూడున్నూ శక్తిబీజాలు, ఒకటొకటిగా, రెండుగా చేస్తే ఈ మన్త్రాలు లభిస్తాయి : ఏకాక్షరీ ద్వ్యక్షరీలను విడిగా జపించవచ్చు. ఈ విధంగానూ :

**క్రీం క్రీం క్రీం దక్షిణే కాలికే క్రీం క్రీం క్రీం స్వాహా ।**
**హూం హూం దక్షిణే కాలికే హూం హూం స్వాహా ।**
**హ్రీం హ్రీం దక్షిణే కాలికే హ్రీం హ్రీం స్వాహా ।**

క్రీం క్రీం క్రీం హూం హూం దక్షిణే కాలికే క్రీం క్రీం క్రీం హూం హూం స్వాహా ।
క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం దక్షిణే కాలికే క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం స్వాహా ।
హూం హూం హ్రీం హ్రీం దక్షిణే కాలికే హూం హూం హ్రీం హ్రీం స్వాహా ।

ఈ మన్త్రజపం వలన లక్ష్మీసరస్వతుల ప్రసన్నత లభిస్తుందని ఫలశ్రుతి.

ఈ దేవతను దేవి అని, కపాలమాలాలంకృతకంఠిగాను, పీనస్తనాఢ్యగాను

రూపవర్ణన. దేవి అన్న సంబోధన ఈ దేవత తేజోమయ స్వరూపాన్ని తెల్పుతూ ఆశ్రితుల అజ్ఞానాన్ని తొలగించే శక్తిగా స్థాపిస్తుంది. అట్లే కపాలమాలాలంకారానికి విశిష్టార్థం చెప్పబడింది. **అకారాది క్షకారాంత వర్ణమాలయే ఈ కపాలమాలయనిన్నీ** అవి కాల స్వరూపిణియైన ఆ దేవతలో ప్రలయసమయాన చేరిపోతాయనిన్నీ తన్త్రశాస్త్రోక్తి : **పంచాశద్వర్ణముండలీగలద్రుధిరచర్చితామ్** (నిరుత్తరతన్త్రము). వస్తు ప్రపంచము, శబ్ద ప్రపంచము ఆ తల్లి శక్తిబీజోద్భవములేయని తాత్పర్యము.

శ్లో॥ అకారాది క్షకారాన్తా పంచాశన్మాతృకాఽక్షరా ।
అవ్యయా అపరిచ్ఛిన్నా త్రిపురాకంఠసంస్థితా ॥ – **రాధాతన్త్రము**

**పీనస్తనాఢ్యే** అనటం వలన మాతృవాత్సల్యామృతసమృద్ధి చెప్పబడినది.



## 2. ధ్యాననిరూపణ ప్రకరణము

**శ్లో॥ గతాసూనాం బాహుప్రకరకృతకాఞ్చీపరిలస –**
**న్నితమ్బాం దిగ్వస్త్రాం త్రిభువనవిధాత్రీం త్రిణయనామ్ ।**
**శ్మశానస్థే తల్పే శవహృది మహాకాలసురత –**
**ప్రసక్తాం త్వాం ధ్యాయఞ్జనని! జడచేతా అపి కవిః ॥ 7**

**అన్వయక్రమం :** (హే) జనని! గతాసూనాం బాహుప్రకరకృతకాంచీపరిలసన్నితంబాం దిగ్వస్త్రాం త్రిభువనవిధాత్రీం శ్మశానస్థే శవహృది తల్పే మహాకాలసురతప్రసక్తాం త్రిణయనాం త్వాం ధ్యాయన్ జడచేతాః అపి కవిః భవతి ।

**ప్రతిపదార్థం :** (హే) జనని = ఓ తల్లీ!, గతాసూనామ్ = ప్రాణములుపోయినవారియొక్క, బాహుప్రకర = చేతులసమూహముతో, కృత = కూర్చబడిన, కాంచీ = మొలనూలుతో, పరిలసత్ = ప్రకాశించుచున్న, నితంబామ్ = కటిప్రదేశముగలదానవు, దిగ్వస్త్రామ్ = దిక్కులే వస్త్రముగా గలదానవు, త్రిభువనవిధాత్రీమ్ = ముల్లోకముల శాసించుదానవు, శ్మశానస్థే = శ్మశానమునందున్న, శవహృది = శవహృదయమున, తల్పే = తల్పమున, మహాకాల = మహాకాలునితో, సురతప్రసక్తామ్ = సంభోగక్రియయందున్న, త్రిణయనామ్ = మూడుకన్నులుగల, త్వామ్ = నిన్ను, ధ్యాయన్ = ధ్యానించుచు, జడచేతాః + అపి = అచేతనుడైనను, కవిః = కవి, భవతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** ఓ తల్లీ! శవముల చేతులతో కూర్చబడిన మొలనూలు కలదానవు, దిగంబరవు, ముల్లోకముల శాసించుదానవు, శ్మశానమున శవహృదయతల్పమున మహాకాలునితో సంభోగప్రసంగమున ఆనందరూపిణివైయున్న మూడు కన్నులుగల దానవు అయిన నిన్ను ధ్యానించినంత అచేతనుడైనను కవియగుచున్నాడు.

ఇది మొదలు 16 శ్లోకములు **శిఖరిణీ** వృత్తములు. ఇది పాదమునకు 17 అక్షరములు గలిగిన అష్టిఛందమున, ప్రతి పాదమున య,మ,న,స,భ,లగ గణములు ఏడింట యతి గలిగిన శిఖరిణీ వృత్తము. శబ్దార్థాన్నిబట్టి, ధ్యానజపక్రియ సాధకుని శిఖరారోహణమే కనుక ఆ ప్రక్రియకు అనేక శిఖరములుగల పర్వతమర్థముగా వృత్తనామౌచిత్యము.

మన్త్రోద్ధారప్రకరణంలోని ఆరుశ్లోకాలలో మన్త్రోద్ధారంతో స్వరూపవర్ణన కూడ కొంత చేయబడినది. ఆ సంబంధమైన పదబంధాల ప్రయోగం చేయబడింది. ఆయా శ్లోకాలలోని రూపవర్ణన నిజానికి ఆ యా శ్లోకాలలోని మంత్రసంబంధి మార్మిక బీజోద్ధారంలో భాగం. అట్లా ఆ యా బీజాలతో రూపాలను దర్శింపవలెనన్నది ఉద్దేశం. అయినను ఆ క్రమంలో బీజాలూ స్వరూపాలూ అన్నీ ధ్యానంలో ఒకే శృంఖలగా ఉండవలసినదే. అట్లా దర్శించి ధ్యానించినట్లయితే, ఆతడు జన్మతః మందబుద్ధియైనను, విషయలాలసుడైనను, నీ సాక్షాత్కారబలంవలన కవియగునని ఫలము చెప్పబడినది. కవిత్వము చెప్పువాడు కవియన్న సాధారణార్థంలోనే కాక, వైదికోక్తులైన **కవిర్మనీషీ పరిభూః స్వయంభూః, కవిం పురాణమనుశాసితారమ్** అన్న ప్రయోగార్థాలను స్మరించి, **నానృషిః కవిః** అన్న భావంలో, ఋషియై, క్రాంతిదర్శియై, పరబ్రహ్మస్వరూపుడవుతాడన్న భావం గ్రాహ్యం.

ఈ శ్లోకంలో దక్షిణకాలికాస్వరూపవర్ణన కొన్ని ప్రశ్నలకు తావిస్తుంది. వానిని పరిశీలించే ముందు వర్ణన నొకసారి మనసుకు తెచ్చుకుందాము :

1. మృతుల చేతులే మొలనూలుగా నుండటం.
2. దిగంబరియై ఉండటం.
3. త్రిభువనవిధాత్రీ, త్రిణయనా
4. శ్మశానంలో శవహృదయంపై మహాకాలసురతాసక్త

ఈ వర్ణనల వాచ్యార్థం చాల గంభీరంగా భయంకరంగా తోస్తుంది. ఆ భయంకర రూపాన్ని త్రిభువనవిధాత్రి, త్రిణయన అన్నవానితో సమన్వయం చేసి అర్థం చేసికొన

వలసియుంటుంది. భీతావహరూపం ప్రళయకాలరూపంగాను, ప్రసన్నరూపం సృష్టి స్థితి క్రియా నిర్వాహకమైనదిగాను భావించవచ్చు. ఈ సమయంలో **మాయ అన్న ఆవరణం లేనిది కాళిక. కనుకే దిగంబరత్వం.** మాయతో మోహవికారమైన మమకారం, దయాది గుణం కూడా అదృశ్యమవుతవి. ఇది సృష్టిలో ఉన్నవాని దృష్టికి భీకరంగా తోస్తుంది. కాని ఇది ప్రకృతిలో ఉన్నవానికి జన్మ, భోగ, మోక్షప్రదమైన రూపం.

జీవుని జన్మ, భోగ, మరణ, మోక్షాలన్నిటికీ కర్మ కారణం, ఈ కర్మకు కర్తృత్వాపేక్ష, భోగాపేక్షా తప్పవు. ఈ ప్రక్రియ సమస్తం కృఞ్ ధాతుసంబంధియే. కర్తృత్వంలో ప్రధానభూమిక వహించేవి కరములు. కర్త, క్రియ, కర్మ, మొత్తం ఈ ధాతునిష్పన్నములే. కరములు ఈ మూడిటికి చెందినవే. కనుక మృతుల చేతులు కాంచి స్థానమనటంలోని మార్మికత ఈ విశేషాన్వయం. ఈ కాంచీయన్నది నితంబావరణం. ఇది యెందుకు దిగంబరత్వంలో కల్పింపబడింది? అంటే, భక్తుల మనస్సులు నిర్వికారంగా సుస్థిరం కావటానికి, అని సమాధానం.

ప్రళయకాలంలో భూమియంతా శవమయమై శ్మశానమవుతుంది కనుక ఈ వర్ణన శ్మశానస్థ శవహృదయంపై మహాకాలసురతాసక్తయని కాళికాదేవి కన్వయించింది. కాళీకాలుల ఐక్యతయే ఈ సురతప్రసక్తి. ఈ సందర్భంలో ఆమె పాదాల క్రింద శవము శివుడేయని శివునకు శవాభేదం చెబుతుంది **తోడల తన్త్రం :**

శ్లో॥ యస్మిన్ త్యక్తా మహాకాలీ శక్తిహీనః సదాశివః ।
శక్త్యా యుతో యదా దేవి, తదైవ శివరూపకః ।
శక్తిహీనే శవః సాక్షాత్ పురుషత్వం న ముంచతి ॥

శవమైన శివుడు మరల చైతన్యవంతుడై శివుడగు ప్రక్రియలో భాగంగా శక్తి స్పర్శ కాళీపాదస్పర్శగా శవహృదయంపై ఉంచబడింది. కాళీతల్పము బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర సదాశివులను పంచమహాప్రేతాలచే కల్పింపబడింది.

త్రిభువనవిధాత్రీ అన్న వర్ణన ప్రళయానన్తర సృష్టిని సూచిస్తుంది. సృష్టి, లయ నిరంతర ప్రక్రియలు. శివశక్తుల కలయిక సృష్టి, శక్తి తొలగినప్పుడు ప్రళయం, శివుడు లేక శవం అనబడిన జగత్తు శవమయమైన శ్మశానమవుతుంది. శవశబ్దం నిర్గుణబ్రహ్మను సూచిస్తుందని గాయత్రీ తన్త్రం, గంధర్వతన్త్రం వివరిస్తాయి.

త్రిణయన శబ్దమున్నూ బహుధా వ్యాఖ్యానించబడినది. త్రికాల సాక్షిత్వానికి చిహ్నంగాను, సూర్యచంద్రాగ్నులు ముప్పురూ మూడు కన్నులై అజ్ఞాన నాశనము

జ్ఞానప్రతిష్ఠ కలుగజేస్తారనిన్నీ, సూర్యచంద్రసంధ్యలు మూడు కన్నులు అనిన్నీ వివరించబడినది.

మహాకాలసురతప్రసక్తా, అని కూడ ఈ శ్లోకం వర్ణించినది. శ్మశానంలో శవహృదయంలో ఈ సురతం విపరీత సురతమే కదా! అర్ధనారీశ్వరరూపంలో వామభాగం శక్తి, కనుకే ఆమెకు వామా అని పేరు. దక్షిణభాగం శివుడు, కనుక శివునకు దక్షణామూర్తియని పేరు. శక్తి శివుని క్రిందుజేసి విపరీతరతి సల్పటంలో, **వామా సా దక్షిణం జిత్వా మహామోక్షప్రదాయినీ,** అని ప్రకృతి పురుషుని వశీకరించే విపరీతరతి మోక్షప్రసక్తిగా భాసిస్తుందని నిర్వాణతన్త్రోక్తి, **గంధర్వతన్త్రం** కూడా

శ్లో॥ అధః కృత్వా తు పురుషం హకారార్ధస్వరూపిణీ ।
విపరీతేన రమతే వహ్నీన్ద్వర్కస్వరూపిణీ ॥

అని యీ విపరీతరతిని పేర్కొన్నది. నిరుత్తరతన్త్రం, **విపరీతరతా కాలీ నిర్గుణా సగుణా యదా,** అని సగుణనిర్గుణతయే విపరీతరతి అంటుంది. యోగశాస్త్రం ప్రకారం కుండలినీ స్వరూపిణియైన కాళికాదేవి మూలాధారంలోని స్వయంభూ లింగానికి పైగా ఉంటుంది. శివస్వరూపుడైన మహాకాళుడు ఆజ్ఞాచక్రంలో భ్రూమధ్యంలో ఉంటాడు. షట్చక్ర క్రమంలో వీరిద్దరి సంబంధమూ సురతరూపంగా చెప్పబడింది.

ధ్యానంలో ఈ భావాలను మనసులో నుంచి ఆ రూపాన్ని దర్శించవలసి ఉంటుంది.



**శ్లో॥ శివాభిర్ఘోరాభిః శవనివహముణ్డాస్థినికరైః**
**పరం సంకీర్ణాయాం ప్రకటితచితాయాం హరవధూమ్ ।**
**ప్రవిష్టాం సన్తుష్టాముపరిసురతేనాఽతియువతీం**
**సదా త్వాం ధ్యాయన్తి క్వచిదపి న తేషాం పరిభవః ॥ 8**

**అన్వయక్రమం :** ఘోరాభిః శివాభిః శవనివహముణ్డాస్థినికరైః చ పరం సంకీర్ణాయాం ప్రకటితచితాయాం ప్రవిష్టామ్, ఉపరిసురతేన చ సన్తుష్టామ్ అతియువతీం హరవధూం త్వాం సదా (యే) ధ్యాయన్తి, తేషాం పరిభవః క్వచిదపి న భవతి ।

**ప్రతిపదార్థం :** ఘోరాభిః = ఘోరములైన, శివాభిః = నక్కలచే, చ = మరియు, శవనివహ = శవసమూహములు, ముణ్డా = తెగిన తలలు, అస్థినికరైః = ఎముకల

పోగులతో, పరమ్ = మిక్కిలి, సంకీర్ణాయామ్ = దట్టముగానున్న, ప్రకటిత = మండుచున్న, చితాయామ్ = చితులయందు, ప్రవిష్టామ్ = ప్రవేశించిన, ఉపరిసురతేన = పురుషాయితముచే, సంతుష్టామ్ = తృప్తిని పొందిన, అతియువతీమ్ = అత్యన్త యౌవనవతివియైన, హరవధూమ్ = శివుని ఇల్లాలవైన, త్వామ్ = నిన్ను, (యే = ఎవరు), సదా = ఎల్లప్పుడు, ధ్యాయన్తి = ధ్యానింతురో, తేషామ్ = వారికి, క్వచిత్ అపి = ఒకప్పటికైనను, పరిభవః = పరాభవము, న భవతి = కలుగదు.

**తాత్పర్యం :** ఘోరములైన శవసమూహములు, నక్కల సమూహములు, తెగిన తలలు, ఎముకల గుట్టలతో దట్టముగా మండుచున్న చితులుగల శ్మశానమున ప్రవేశించిన కాళిక పురుషాయితముతో సంతృప్తి చెందిన అత్యన్తయౌవనవతి. అట్టి దేవిని సదా ధ్యానించువారికి ఎప్పటికిని అవమానము కలుగదు.

ఇది ఘోరమైన మృత్యుతాండవవేదికయైన ప్రళయకాల శ్మశానదృశ్యము. 7వ శ్లోకంలో శ్మశానము, శవముల ప్రసక్తి యున్నది. ఈ శ్లోకంలో శ్మశానము, అందున, శ్మశాన బీభత్సభయానక దృశ్యములు వర్ణింపబడినవి. శ్లోకారంభం శివాభిః అంటూ వెంటనే శవనివహం చెప్పబడింది. శివ–శవ శబ్దాలకు ప్రతిష్ఠితసంబంధం ముందే చెప్పబడింది. కాని ఇది శివా శబ్దం. ఈ శబ్దానికి కోశార్థాలు : 1. గుంటనక్క, 2. పార్వతి, 3. ముక్తి, 4. పసుపు, 5. శమీవృక్షము, 6. దూర్వా అనబడు గడ్డి. వీనిలో అన్వయమయ్యే అర్థమేది? శివాభిః అన్నది తృతీయా బహువచనం కనుక, గుంటనక్కలతో అని చెప్పవచ్చు, శవనివహప్రసంగం ఉన్నది కనుక గుంటనక్క లుండటమూ ప్రకృతి సహజమే. అయితే, అంత ప్రళయకాల మృత్యుతాండవంలో గుంటనక్కలు మిగిలి ఉన్నాయా!? అన్న శంక కలుగక మానదు. అట్లే, పసుపు, శమీ వృక్షాలు, దూర్వా గడ్డి అన్నవాటికిన్నీ సందర్భౌచిత్యం కానరాదు. మిగిలినది : పార్వతి, ముక్తి. శివాభిః అన్నరూపాన్ని బట్టి, పార్వతి అనగా శివుని శక్తియైన పార్వతి అనేక రూపముక్తిగా దర్శించబడిందని చెప్పవచ్చు. ముక్తి సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము, కైవల్యము అన్న వివిధ లక్షణాలతో చెప్పబడింది. ఈ అన్ని లక్షణాలతో శివా, అనగా, శివశక్తి అంతటా చరిస్తూన్నదని అన్వయించవచ్చు. ఈ శక్తి ఈ విపరీతరతితో సంతృప్తిచెందిన అతియువతి, అనగా, యౌవనైకమూర్తియైన త్రిపురసుందరి. క్రిందటి శ్లోకంలో ఈమె మహాకాలసురతప్రసక్తగా చెప్పబడింది. ఇప్పుడీమె ఈ సురతసంతుష్టగా దీపిస్తూన్నది.

ఈ శ్లోకంలో హర, శివా శబ్దాలు విశేషార్థస్ఫోరకాలుగా ప్రయోగించబడినవి. హరశబ్దప్రయోగంవలన ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధిమానసిక తాపాలను హరించే క్రియ సూచితం కాగా, శివా శబ్దం, అపంచీకృత మహాభూతైక భావన స్ఫురిస్తుంది. ఈ విధంగా ఈ శబ్దాల ప్రయోగం మోక్షప్రతిపాదకం అనవచ్చు.

ఈ శ్లోకానికి వేరొక అన్వయార్థం : ముండాస్థినికరైః అనటంలో శ్వేతకంకాళాల దర్శనం, తద్ద్వారా సత్త్వాదిగుణరహిత చిచ్ఛక్తి స్వయంప్రకాశమానమవుతుంది. అపంచీకృత మహాభూతాధిష్ఠిత అవుతందీ చిచ్ఛక్తి. ఈ స్వరూపాన్ని ధ్యానించేవారికి ముక్తి కరతలామలకం; అట్టివారికి తిరస్కారావమానాలు కలుగవు. ఈ రూపం కాళీమాత సమష్ట్యాత్మకరూపం కనుక ఈ రూపధ్యానం కూడ సమష్ట్యాత్మక ధ్యానమవుతుంది.

భ్రమరకీటన్యాయం ప్రకారం కీటకం భ్రమరమవుతుందనీ అందుకు కారణం నిరంతరం భ్రమరం ఝుంకారంచేస్తూ దాని చుట్టూ తిరగటమనీ లోకంలో అనుభవ జ్ఞానం. చింతన ధ్యానం అన్నవి ఏకాగ్రమైనప్పుడు సాధకునిలోని శక్తి విజృంభిస్తుందన్నది అనుభవపూర్వకంగా మహాత్ములు, యోగులు నిరూపించిన సత్యం. ఈ సత్యమే యోగసాధన సాఫల్యమూలం. బ్రహ్మజ్ఞుడు బ్రహ్మయే అవుతాడంటే ఆశ్చర్యం లేదు. **ధ్యానేన లభతే సర్వం ధ్యానేన విష్ణురూపకః** అంటుంది నిర్వాణతన్త్రం.

ఈ శ్లోకాలలో భయంకరంగా శ్మశానబీభత్సదృశ్యాలు దర్శించబడినవి. ఈ నేపథ్యంలో దక్షిణకాళికాదేవి, హరవధువు, శ్యామా, నిత్యయౌవనా, త్రిణయనా, విగలితచికురా, స్మితముఖీ మాతృత్వమూర్తి మహాకాలునితో విపరీతరతి సంతుష్టగా వర్ణింపబడింది. ఈ స్థితి విపరీతస్థితియే. సురతభోగానికిది సమయమా? కాదనిపిస్తుంది. సందర్భమా? కాదనిపిస్తుంది. కాని ఇందలి మనఃస్థితిరహస్యమొకటి చాలా మందికి అనుభవంలో ఉన్నదే. అదేమంటే, ఒక విపరీతభావోద్వేగం కలిగినప్పుడు, మనస్సు వికలమైనప్పుడు, తనవారు చేరువలో ఉంటే, పురుషునికైనా, స్త్రీకైనా అప్రయత్నంగా పరస్పరాకర్షణ కలిగి, అది దుఃఖంలో సహానుభూతిప్రకటనగా దగ్గర చేర్చి, అనంతరం సురతాసక్తులను చేస్తుంది. ఇది జ్ఞాపికగా, ప్రళయంలో పునః సృష్టి ప్రేరణగా యీ సురతక్రియను, సురతసౌఖ్యాన్నీ దర్శించవచ్చు. **శివుడు మరల శవస్థితినుండి శివస్థితికి పునరుద్ధరింపబడే శక్తిపాతప్రక్రియయే యీ విపరీతసురతం.** మహానిర్వాణతన్త్రంలో, **శ్మశానం ద్వివిధం దేవి చితాయోనిప్రభేదతః**, అని చెప్పబడిన దానిని స్మరించి ఇక్కడ వర్ణిత శ్మశానం ఈ రెండు రూపాలనూ స్ఫురింపజేస్తున్నదని చెప్పవచ్చు.

ఈ శ్లోకాలలోని వర్ణనను **కాలీతన్త్రం**లోని వర్ణనను పోల్చి చూడవచ్చు. ఆ శ్లోకాలివి:

శ్లో॥ కరాలవదనాం ఘోరాం ముక్తకేశీం చతుర్భుజామ్ ।
కాలికాం దక్షిణాం దివ్యాం ముణ్డమాలావిభూషితామ్ ॥

శ్లో॥ సద్యశ్ఛిన్నశిరఃఖడ్గవామాధోర్ధ్వకరాంబుజామ్ ।
అభయం వరదం చైవ దక్షిణోర్ధ్వాధపాణికామ్ ॥

శ్లో॥ మహామేఘప్రభాం శ్యామాం తథా చైవ దిగంబరీమ్ ।
కంఠావసక్తముండాలీగలద్రుధిరచర్చితామ్ ॥

శ్లో॥ కర్ణావతంసతానీతశవయుగ్మభయానకామ్ ।
ఘోరదంష్ట్రాం లలజ్జిహ్వాం పీనోన్నతపయోధరామ్ ॥

శ్లో॥ శవానాం కరసంఘాతైః కృతకాంచీం హసన్ముఖీమ్ ।
సృక్కద్వయగలద్రక్తధారావిస్ఫురితాననామ్ ॥

శ్లో॥ ఘోరరావాం మహారౌద్రీం శ్మశానాలయవాసినీమ్ ।
బాలార్కమణ్డలాకారలోచనత్రితయాన్వితామ్ ॥

శ్లో॥ దన్తురాం దక్షిణవ్యాపిముక్తాలంబికచోచ్చయామ్ ।
శవరూపమహాదేవహృదయోపరి సంస్థితామ్ ॥

శ్లో॥ మహాకాలేన చ సమం విపరీతరతాతురామ్ ।
శివాభిర్ఘోరరావాభిశ్చతుర్దిక్షు సమన్వితామ్ ॥

శ్లో॥ సుఖప్రసన్నవదనాం స్మేరాననసరోరుహామ్ ।
యోగినీచక్రసహితాం కాలికాం భావయేత్సదా ।
ఏవం సంచిన్తయేత్కాలీం సర్వకామార్థసిద్ధయే ॥



## 3. సాధనప్రకరణం

**శ్లో॥ వదామస్తే కిం వా జనని! వయముచ్చైర్జడధియో
న ధాతా నాపీశో హరిరపి న తే వేత్తి పరమమ్ ।
తథాపి త్వద్భక్తిర్ముఖరయతి చాస్మాననమితే!
తదేతత్ క్షన్తవ్యం న ఖలు పశురోషః సముచితః ॥** 9

**అన్వయక్రమం :** (హే) అనమితే! (హే) జనని! (యదా) తే పరమం (తత్త్వం) ధాతా న వేత్తి, ఈశః అపి (న వేత్తి), హరిః అపి (న వేత్తి), (తదా) ఉచ్చైః జడధియః వయం తే కిం వా వదామః తథా అపి త్వద్ భక్తిః అస్మాన్ ముఖరయతి । తత్ ఏతత్ క్షన్తవ్యమ్। పశురోషః న ఖలు సముచితః ।

**ప్రతిపదార్థం :** (హే) అనమితే (న+అమితే) = అమితముకానిదానా!, (అ + నమితే) = వంచబడనిదానా, నమస్కరించనివారు లేనిదానా! (హే) జనని = ఓ తల్లీ!, (యదా = ఎప్పుడు,) తే = నీయొక్క, పరమమ్ = పరమమును, అనగా, పరమతత్త్వమును, ధాతా = బ్రహ్మ, ఈశః అపి = ఈశ్వరుడున్ను, హరిః అపి = విష్ణువున్ను, న వేత్తి = తెలిసికొనకున్నారో, (తదా = అప్పుడు,) ఉచ్చైః = మిక్కుటముగ, జడ = అచేతనమైన, ధియః = బుద్ధిగల, వయమ్ = మేము, తే = నీయొక్క రూపగుణ తత్త్వములు, కిం వా వదామః = ఏమి చెప్పగలము?, తథా అపి = అట్లైనను, త్వద్ = నీయొక్క, భక్తిః = భక్తి, అస్మాన్ = మమ్ములను, ముఖరయతి = పలికించుచున్నది, తత్ ఏతత్ = ఆక్రియ, ఆ కార్యము, క్షన్తవ్యమ్ = క్షమింపదగినది, పశురోషః = కోపము, న సముచితః ఖలు = సముచితము కాదుకదా.

**తాత్పర్యం :** ఓ అనమితా! ఓ తల్లీ! నీ తత్త్వమును బ్రహ్మ విష్ణు ఈశ్వరులే తెలిసికొనలేరు. కాగా, అమితమందబుద్ధులమైన మేము నీ రూపగుణతత్త్వముల పరమార్థమును ఏమని చెప్పగలము? అట్లయినను, నీ యందలి భక్తి మాచే యేదో ప్రలాపములాడించుచున్నది. ఇది క్షమింపదగిన తప్పిదమే తప్ప మాపై కోపించుటకు సరియగు కారణము కాదు. కనుక మన్నింపుము.

తెలిసి తెలియని మాటలతో వర్ణించే కంటే సత్యమేదో తెలిసిన పెద్దలనడిగి తెలిసికొని మాటాడరాదా? అంటే, అంతగా నిన్ను గురించి తెలియజెప్పగలవారు లేరు కదా. అదేమంటే, నీవు తల్లివి, నీ బిడ్డలమైన మేము నిన్ను గురించి తెలియలేము. పైగా, నీవు ఆదిమాతవు, అనాదివి, కనుక నీ సృష్టిలోని వారే దేవతలు కూడ. అనగా, విశ్వస్రష్టగా జగన్నుతుడైన బ్రహ్మ, విశ్వపాలకుడని జగమెఱిగిన విష్ణువు, లయకారుడుగా ప్రసిద్ధుడైన రుద్రుడు, ఈ త్రిమూర్తులున్నూ నీ బిడ్డలే కనుక వీరున్నూ ఎఱుగనివారే. ఇక ఇంద్రాది దేవతల మాట అప్రస్తుతమే కదా! కనుక వచ్చి రాని మాటలతో తెలిసి తెలియనివేవో భక్తితో మాటాడితే, ఏ తల్లీ కోపగించదు. అమ్మలగన్న అమ్మవు నీవూ క్షమిస్తావు, అన్నది భావం.

తన ఆరాధ్యదేవతను గురించి దయాది గుణాలు వరదాభయముద్రితహస్తాలు ఇవే కదా రూపగుణవర్ణనగా యే భక్తుడైన చెప్పేవి. ఇది సంప్రదాయసిద్ధమే. మరి త్రిమూర్తులకు సైతం తెలియనిదేమిటి? అని ఆలోచిస్తే, ఈవిధమైనవర్ణన పూర్వమేఈ కవి చేసియున్నాడు కనుక ఇది చెప్పదలచినది, భక్తుడు ఆ తల్లిని చేరుకొనే మార్గమేది? అనగా, సాధనరహస్యాలు, అని బోధపడుతుంది. ఇవి కూడ యోగశాస్త్రంలోను, మంత్రతంత్రశాస్త్రాల్లోనూ చెప్పబడినవి కదా, అంటే, అవును ఆ చెప్పబడినవి ప్రమాణాలని నమ్ముతున్నాం కాని వాని ప్రామాణికతకు ఋజువైన పరమప్రమాణమేది? అదే పరమరహస్యం. ఈ శాస్త్రప్రామాణికతను అవగాహన చేసికొనటంలోనూ దోషాలుండక తీరదు. ఎందుకంటే, ఎంత భక్తులమైనప్పటికి, మనం ఉచ్చైర్జడధియః, అతిమందబుద్ధులం. అంటే, ఈ శాస్త్రరహస్యాలు మానవమేధస్సుకు సులభంగా అందేవి కావు, కనుక ముందే అమ్మకు తప్పులు కాయుమని క్షమాభిక్షనర్థిస్తూన్నాడు కవి. ఈ తల్లి అనంతత్వజ్ఞానం లేని కారణంగానే కాళీ మొదలైన వివిధరూపాలలో ఆరాధన, అని **విష్ణుయామలతన్త్రం** వివరిస్తుంది :

శ్లో॥ మాతస్త్వత్పరమం రూపం న చ జానాతి కశ్చన ।
కాల్యాదిస్థూలం యద్రూపం తదర్చన్తి దివౌకసః ॥

విగ్రహారాధన యెందుకు? అన్న ప్రశ్నకిది యొక సమాధానం : పరమతత్త్వరహస్యజ్ఞానం లేకపోవటం. దేవతలైనా మానవులైనా ఇదే సత్యం. అంతుచిక్కని తత్త్వాన్ని నేరుగా భావించటం అసాధ్యం కనుక, భావనకూడా ఒక రూపకల్పనప్రక్రియయే కనుక సరూపారాధన, సగుణాత్మక పద్ధతులు సూచింపబడి ఆచారంలో ఉన్నవి. దీనికి మరియొక కారణం, ఈమె ఏక–అనేక, స్థూల–సూక్ష్మ, వ్యయ–అవ్యయ, మిత–అమిత, రూప–అరూప, సగుణ–నిర్గుణ, ఇత్యాది పరస్పరవిరుద్ధలక్షణదర్శిత కనుక ఈమె రూపమిది, గుణమిది, తత్త్వమిది అన్న నిరూపణ అసాధ్యమవుతూన్నది. శక్తిస్వభావ తత్త్వాలు ఒకేఒక నిర్వచనానికీ సూత్రానికీ అందేదీ కాదు, ఇమిడేదీ కాదు, దేనికీ లొంగేదీ కాదు. ఈ విషయాన్ని **దేవీసూక్తం** ఇట్లా ప్రకటిస్తూన్నది :

శ్లో॥ ఏకానేకా సూక్ష్మరూపాఽవికారా
బ్రహ్మాండానాం కోటికోటిం ప్రసూతే ।
కోఽహం విష్ణుః కోఽపరో వా శివాఖ్యో
దేవాశ్చాన్యే స్తోతుమీశా భవేమ ॥

సృష్టికి పూర్వం త్రిమూర్తులు, పంచతన్మాత్రలు, కాలముసైతం లేనప్పుడు ఉన్నది పరబ్రహ్మస్వరూపయైన ఈ సర్వకారణశక్తి కాళీమాతయే. అంతటి దేవిని ఉపాసించే పద్ధతిని నిరూపించి నిర్దుష్టంగా చెప్పగలిగిన శాస్త్రములూ శాస్త్రకారులూ ఉండే వీలులేదు. కాన అభిలాషననుసరించి అనేక పద్ధతులు వారి వారి అవగాహనానుసారం లోకంలో విభిన్నాచారాలుగా వెలసినవి. ఇవి, పాశబద్ధములైన పశువులు కట్టు త్రాడునూడలాగి కొమ్ముమవిసరిన చందాన, పశుచేష్టలు. జీవుడు పశువుగా గుర్తించబడినవాడే కదా. కనుక యజమాని పశువునువలె మన్నింపదగునని నివేదన. ఈ జీవుని బంధించే **పాశాలు** విషయాన్ని **రుద్రయామల**మిట్లా వివరిస్తూన్నది :

శ్లో॥ ఘృణా శంకా భయం లజ్జా జుగుప్సా చేతి పంచమీ ।
కులం శీలం తథా జాతిరష్టౌ పాశా ఇమే స్మృతాః ॥

శ్లో॥ జీవశ్శివశ్శివో జీవః స జీవః కేవలశ్శివః ।
పాశబద్ధస్సదా జీవః పాశముక్తస్సదాశివః ॥

పాశబద్ధుడుగా ఉన్నంతకాలం శివుడు జీవుడైయుండి, పాశముక్తుడు కాగానే తన శివస్వరూపాన్ని తెలిసి శక్తిదర్శనం, తత్త్వదర్శనం చేస్తాడు. కనుక పాశస్వరూపం ముందుగా తెలియదగినది. పాశాలు ఎనిమిదిగా రుద్రయామలోక్తి : **1)ఘృణ**, అనగా, అరుచి: లోకంలోని కొన్నింటియందు అయిష్టత, అనాసక్తి, విద్వేషం వంటి భావాలు కలిగి యుండటం; **2) శంక**, అంటే, సంశయం, లోకంలోని విషయాల వలన తనకు కలిగే ప్రయోజనాల గురించి సందేహం, అపనమ్మకం, లాభనష్టాల చింత, దీనివలన కపటం మోసం, ఇత్యాది ప్రవర్తన. కనుకే, సంశయాత్మా వినశ్యతి, అని భగవద్గీత హెచ్చరించింది; **3) భయం** : శంక వలన భయం కలుగుతుంది. దేనిని గురించి భయం? తనదిగా భావించినవి దూరమైపోతాయని, నశించిపోతాయని భయం. నశించిపోయేవానిపై ప్రీతిని పెంచికొనుటయే దీనికి మూలం; **4) లజ్జ**, అంటే, ఆత్మన్యూనతాభావం వలన మానావమానాల భావన, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్; **5) జుగుప్సా**, ఇతరులలో దోషాలను లెక్కించి, వారిని నిందించే లక్షణం. లజ్జతో దీనికి దగ్గఱ సంబంధమున్నది : Judge not lest ye be judged అన్న Bible హెచ్చరిక గమనార్హం; **6) కులం** : ప్రసిద్ధుడైన పూర్వజుని వంశంవారమని చెప్పికొని, అది తమ గొప్పగా భావించి ప్రచారం చేసికొనే లక్షణం : కులీనతకు ఈ కారణంగా ప్రాముఖ్యం లోకంలో; **7) శీలం** : Character, Conduct అని చెప్పబడేవి, దీన్నే శిష్టాచారం

అనటమున్నూ కద్దు. కాని విశ్లేషించి చూస్తే, దీని స్వభావమేమిటి? వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పణంగా పెట్టి, త్యజించి, సంప్రదాయం, ఆచారం పేరిట, పరుల ప్రవర్తనను సమర్థించటం, అనుసరించటం; **8) జాతి** : చాతుర్వర్ణవ్యవస్థ; ఈ వ్యవస్థలోని శాఖోపశాఖలకే కులమన్న వాడుక. ఈ వ్యవస్థను లౌకికశాస్త్రాలు, పురాణాలు కూడా ఖండించినవి. ఈ ఎన్మిది పశుపాశాలు, అనగా, జీవుని బంధించియుంచే త్రాళ్ళు.

వేరొక పద్ధతిలో కూడ యీ పశుపాశ నిరూపణ చేయబడింది. ఈ విశ్లేషణ ప్రకారం, **పశువు** అంటే అణుశక్తితో కూడినవాడైన, పరిచ్ఛిన్నశక్తితో కూడినవాడైన, సీమితశక్తితో కూడినవాడైన **జీవుడు.** దీనినిబట్టి పశువు (జీవుడు) మూడు విధాలు : **విజ్ఞానాకల, ప్రలయాకల, సకల.** వీరిలో విజ్ఞానాకల జీవుడు కేవలం ఆణవమల మాత్రావశిష్టుడై, యోగముచేతగాని లేక సంన్యాసముచేతగాని, కాక ఫలభోగముచేగాని క్షీణకర్ముడై శరీరబంధముత్పన్నము కానివాడు. రెండవవాడైన ప్రలయాకల జీవుడు ప్రలయకాలంలో శరీరం విడచినందువలన మాయీయమలము నశించగా, ఆణవమలముతోను, కార్మణమలముతోను కూడినవాడు కనుక శరీరబంధము రహితము కాదు. మూడవవాడు సకలుడు. వీనిలో ఆణవ, మాయీయ, కార్మణ మలత్రయముతో కూడిన వాడీ జీవుడు.

జీవుడు శివుడే కదా, మరి శివుడు జీవుడెట్లయినాడు? కేవలం పాశబద్ధుడైనందున. అంతటి శివుని బంధించగల పాశాలేవి? అవి నాలుగు విధాలు: **1) మలము :** ఇది జీవుని స్వాభావికజ్ఞానక్రియాశక్తిని నిష్క్రియం చేసేది, ఆటంకపరచేది; **2) కర్మ :** జీవుడు ఫలాన్ని ఆశించి క్రియాశీలుడవుతాడు. క్రియకూ ఫలానికి ఉన్న సంబంధం విత్తనానికి చెట్టుకూ ఉన్న సంబంధం : ఒకదాని నుండి రెండవది ఉత్పన్నమవుతూ నిరంతరం సాగుతూ ఉండి, మొదలు తుదలు తెలియరానిది : జన్మనుండి కర్మ, కర్మనుండి జన్మ శృంఖల యేర్పడుతుంది. **3) మాయ :** సృష్టిసాగే కాలంలో జీవులను పుట్టించి, నియంత్రించి, మరల లయం చేసేది; **4) రోధశక్తి :** దీనిద్వారా శివస్వరూపాన్ని జీవునకు తెలియరాకుండ నిరోధించేది, అనగా, జీవునకు ఆత్మజ్ఞానం కలుగకుండ అడ్డంపడేది. మహాప్రలయంలో శివునిసైతం అచేతనునిగా చేసేది. ఈ నాలుగింటివలన శివత్వాన్ని కోల్పడి శివుడు జీవుడవుతాడు, అనగా, పశు పతియే పశువవుతాడు, పాశుబద్ధుడవుతాడు.

అయితే, మరి పశువైన పశుపతి ఈ పాశాలనుండి ముక్తుడై మరల పశు

పతి కావటమెట్లా సాధ్యం? అన్నదానికి ఒకే ఒక్క సమాధానం **భక్తి.** 'భక్తి' అన్న మాట, యే మతం వారికైనా, దేవునిపట్ల భయాన్ని, విశ్వాసాన్నీ ప్రకటించే పద్ధతి కదా. మరి నాస్తికుల కేమి దారి? నాస్తికులకైన భక్తి ఒక్కటే దారి. అస్తి–నాస్తి విచికిత్సను విడిచి జీవితాన్ని సరియైన పంథాలో నడుపుకోమని బోధించిన బుద్ధుడుసైతం, బుద్ధం శరణం గచ్ఛామి, ధమ్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి, అంటూ త్రివిధ శరణాగతినే ప్రతిపాదించినాడు. శరణ్యుడైన బుద్ధుడు కేవలం బౌద్ధమతాన్ని స్థాపించిన చారిత్రక వ్యక్తిమాత్రుడే కాదు, ప్రతివ్యక్తిలోనున్నవాడు, ప్రతి వ్యక్తి తనలో మేల్కొల్పి ఆరాధింపదగినవాడు, వ్యక్తి వివేకశక్తికి పరాకాష్ఠగా నిల్చేవాడు. చారిత్రక బుద్ధుడు తనలో యే విశ్వవివేకాన్ని ప్రబుద్ధం చేసి తాను బుద్ధుడైనాడో, ఆ బుద్ధుడే శరణ్యుడు. ఆ బుద్ధుని ఆదర్శం ధర్మం, ఇది దేశకాలమతాతీతమైనది. కనుక ఆ ధర్మం శరణ్యం. వ్యష్టి సమష్టిగా రూపాంతరం చెందినదే సంఘం. ఆత్మన్యేవ సర్వభూతాని, అని గీతచే వర్ణింపబడిన ప్రబుద్ధాత్మస్థితి. ఇదే శరణ్యం. ఇదంతా భక్తితత్త్వంతో నిండియున్నదే. మతరహిత సమాజ స్థాపనకు మార్గ మీ సూత్రమే. కాని భక్తి భయంవలన కలుగుతుంది, **భీతోఽస్మాదుదేతి సూర్యః భీతోఽస్మాత్పవతే వాయుః** (భయం కారణంగానే సూర్యుడుదయిస్తాడు, గాలి వీస్తున్నది), అని వేదం చెబుతున్నది కదా. భయాన్ని ప్రస్తావించకుండ భక్తిప్రసంగం లేదుకదా, అంటే, సత్యమే. ఈ భయం తనను గురించి, తన వారిని గురించి, తనదైన వస్తువును గురించి. దీనివలన ప్రేరణ పొందినదే స్వార్థం. దీనికి అంకుశం భక్తి. స్వార్థంలోనూ భక్తిచ్ఛాయలు ప్రాకృతికంగా ఉండనే ఉన్నవి. ఆ ఛాయలే శరీరాభిలాష, వాత్సల్యం, స్నేహం, ప్రేమ, మమకారం, అనురాగం, పెద్దలపట్ల గౌరవం, తన ఆదర్శంపట్ల విశ్వాసం, దేవునిపట్లనైతే, అదే భక్తి. భయంలోని స్వార్థాన్ని ఎంతగా అన్యులదిశగా, అన్యవిషయాల, వస్తువుల దిశగా విస్తరింపజేస్తే, వ్యక్తి తాను అంతగా విస్తరిస్తాడు. ఈ ఆత్మవిస్తారక్రియకే విశ్వప్రేమయని, భక్తియని పేరు. స్వార్థంలో కేంద్రంగా ఉన్న తానే, పరార్థంలోను, పరమార్థంలోను కేంద్రం కావటానికి పేరు భక్తి. భక్తి తొమ్మిది విధాలని సంప్రదాయం వివరిస్తూన్నది : **శ్రవణ, కీర్తన, మనన, చరణసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదన, అనునవి ఈ తొమ్మిది విధాల భక్తిప్రకటన.**

ఈ నవవిధభక్తి మూడు ప్రాంగణాలుగా విభక్తమయింది. ప్రథమప్రాంగణంలో రెండు సోపానాలు : శ్రవణం, కీర్తనం. వీనిద్వారా ద్వితీయప్రాంగణంలో ప్రవేశం సాధ్యం. ద్వితీయప్రాంగణంలో మూడు సోపానాలు : మననం, చరణసేవనం, అర్చన.

తృతీయప్రాంగణంలోనూ మూడు సోపానాలు : దాస్యం, సఖ్యం, ఆత్మనివేదన. దీని అర్థం : వ్యక్తి తనలోని శివుని పాశముక్తుని చేయటానికి ఎక్కవలసిన మెట్లు, పారస్పరికమైన అంశాలను ఒక ప్రాంగణంగా చెప్పటమైనది. సాధనక్రమాన్ని చెప్పేదే ఈ విభజన. సాధనక్రమంలోని అనుభవాలు భక్తిని దృఢతరం చేస్తూ భక్తుని ప్రగతికి సూచికలుగా ప్రోత్సాహాన్నిస్తాయి.

భక్తి సాధనవిధానాన్నిబట్టి మూడు పద్ధతులుగా త్రిగుణాత్మకంగా ఉంటుంది. అంటే రాజసభక్తి, తామసభక్తి, సాత్త్వికభక్తి సాధన పద్ధతులు వేర్వేరుగా ఉంటాయి. వీనిలో ఉత్తమమైనది సాత్త్వికమార్గం, మధ్యస్థమైనది రాజసభక్తిమార్గం, తామసభక్తి అధమం. కారణం, సాత్త్వికభక్తి మానసికం, ఆంతరంగికం; రాజసభక్తి బాహ్యాచార పరాయణం, కనుక తామసభక్తికి దగ్గరగా ఉండి, తామసంలోకి జారిపోయే అవకాశం అధికంగా ఉంటుంది; అంటే బాహ్యాచారం ప్రభావంవలన ఆడంబరంగా దాంభికంగా మారిపోయి ఆ ఆచారకర్మే సర్వస్వం అన్న స్థితికి చేరుకొని, లోకంలో దీనివలన తనకు కలిగే భక్తుడన్న కీర్తిప్రతిష్ఠలే లక్ష్యంగా ఆగిపోయి ప్రగతి దుర్గతిగా మారవచ్చునని హెచ్చరిక.

భక్తికి **పూజ** ముఖ్యాధారం కాగా పూజకు భక్తి మూలాధారమవుతుంది. ఈ రెండున్నూ జ్ఞాన జ్ఞేయములవలె పరస్పరాశ్రయాలు. ఈ రెండిటిని ఫలవంతం చేసేది శ్రద్ధ. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం, అంటుంది భగవద్గీత. పూజ జ్ఞానాన్వితం కావాలి, జ్ఞానఫలాగ్రం కావాలి. అప్పుడే జ్ఞేయమైన లక్ష్యం ప్రత్యక్షసిద్ధమవుతుంది.

ఈ సమస్త ప్రక్రియలో ప్రముఖపాత్ర వహించేది **భావన.** భావన అన్నది మనోధర్మం, కనుక ఇది శాబ్దికం కాని ప్రక్రియ. భావం మనసులో పుట్టినది పుట్టినట్లు యథాతథంగా భాషద్వారా ప్రకటం కాదు, కాలేదు. అది పుట్టిన చోటనే పెరిగి, విరిగి నశిస్తుంది. భావనాసామర్థ్యంవలన మాత్రమే అవగాహన యేర్పడి, స్త్రీ-పురుష, లఘు-గురు, పదార్థము-శక్తి, ఇత్యాది జ్ఞానం కలుగుతూన్నది. ఇట్టి భావం అధమ, మధ్యమ, ఉత్తమ, ఉత్తమోత్తమమను నాలుగు విధాల భేదాలతో ఉంటుంది. అధమభావం దేహాభిలాషవలన కలుగుతుంది, అనగా, అహంకారం, రాగద్వేషాలు, స్వార్థం ఇత్యాది భావాలకు దేహాభిలాష జన్మనిచ్చి పోషిస్తుంది. అరిషడ్వర్గంగా చెప్పబడే కామక్రోధ లోభమోహమదమాత్సర్యాల మాతృక ఇది. దీని కారణంగా, ఈ కామ్యపూర్తికోసం చేసే దైవచింతన చేసేవారు మధ్యములు. దైవాన్నాశ్రయించినప్పటికి, అట్టి భక్తుని

భావన లౌకికవిషయాల చుట్టూనే పరిభ్రమిస్తూ ఉంటుంది. అయినను, పారలౌకికశక్తి గుర్తింపు, ఆ దిశగా కొంత ప్రయత్నం ఉంటుంది కనుక మధ్యమం. ఉత్తమభావన యీ లౌకికమైన జంజాటం నుండి ముక్తిదిశగా సాగేది. కాగా ఉత్తమోత్తమమైనది భావరాహిత్యం. ఎందుకంటే, భావం అన్నది ద్వంద్వస్థితికి ప్రతీక. భావించేవాడు, భావించబడేది, భావము అన్న ముప్పేట ముడి భావనావ్యవస్థ. ఈ ముడివీడితే, ఈ మూడు ఒక్కటే అయిపోగా సంపూర్ణానంద స్వరూపంగా ఆత్మజ్ఞానమూ సాక్షాత్కారమూ కలుగుతుంది. అందుకే **భావరాహిత్యం ఉత్తమోత్తమం** అవుతుంది. భావానికి అర్థం ఉనికి కనుక భావరాహిత్యంతో జన్మరాహిత్యం సిద్ధిస్తుంది.

భావమే ఆచారంగా పరిణమిస్తుంది కనుక **ఆచారాలు** అయిదువిధాలు, అని **కాలికాకల్పం** బోధిస్తుంది.

శ్లో॥ పశ్వాచారశ్చ శైవశ్చ వీరశ్చ దివ్య ఏవ చ ।
సిద్ధాన్తశ్చ భవేద్భావః కౌలశ్చ భావవర్జితః ।
భావాతీతే భవేన్ముక్తిర్భావైర్బద్ధో భవేన్నరః ।
దివ్యో దేవస్వరూపశ్చ సిద్ధాన్తో దేవ ఏవ చ ॥

భావం, తదనుసారి ఆచారం పశు, శైవ, వీర, దివ్య, సిద్ధాన్త భేదాలుగా ఉండి భావరాహిత్యంతో కౌలంగా పరిణతి చెందుతుందని భావం. భావాతీతుడు ముక్తుడవుతాడు, భావబద్ధుడై నరుడవుతాడు; దివ్యభావంతో భక్తుడు దేవస్వరూపు డవుతాడు. సిద్ధాన్తభావంలో చేరినవాడు దేవుడే అవుతాడన్నది తాత్పర్యం. దివ్యభావంలో దక్షిణాచారము, సిద్ధాన్తభావంలో వామాచారము, బీజంగా ఉంటాయి, అంటుంది **నిగమానందతన్త్రం.**

ఈ భావాలైదింటిలో సాధకులకు ప్రాథమిక ప్రాముఖ్యం గలవి పశు, వీర, దివ్య భావాలు. వీటి ననుసరించి ఆచారాలున్నూ మూడైనవి : దక్షిణ, వామ, కుల. వీనిలో ఏదో ఒక భావాన్ని, ఆచారాన్ని ఆశ్రయించి శక్తిసాధన సాగించవచ్చు. కాని, **భావచూడామణి** ననుసరించి,

శ్లో॥ భావస్తు త్రివిధో దేవ దివ్యవీరపశుక్రమాత్ ।
ఆద్యభావో మహాదేవ శ్రేయాన్ సర్వసమృద్ధిదః ।
ద్వితీయో మధ్యమశ్చైవ తృతీయః సర్వనిందితః ॥

దివ్యభావం శ్రేయస్కరం, వీరభావం మధ్యమం, పశుభావం నింద్యం. **కాలీవిలాసం**లో,

శ్లో॥ శృణు భావత్రయం దేవి దివ్యవీరపశుక్రమాత్ ।
దివ్యశ్చ దేవవత్ ప్రాయో వీరశ్చోద్ధతమానసః ।
పశుభావః సదా దేవి శుద్ధశ్చ శుచివత్సదా ॥

ఈ రెండిట అభిప్రాయభేదం కన్పిస్తుంది : ఐనప్పటికి ఈ భేదం పాత్రభేదాన్ని బట్టి యేర్పడినదనవచ్చు. దాన్ని పరిశీలిస్తే, వీరభావం వామమార్గాచారం కలది :

శ్లో॥ మద్యం మాంసం తథా మీనం ముద్రా మైథునమేవ చ ।
మకారపంచకం సేవ్యం శివశక్తిసమాగమే ॥

అన్న **మేరుతన్త్రోక్తి**ననుసరించి వీరభావం వామాచారమార్గాన మద్యంత్రాగి, మాంసం తిని, మైథునానందాన్ని పొందటం ద్వారా శక్తిసాధన సాగుతుంది. మీనం అన్నది మాంసభక్షణంలో అంతర్భాగం కాగా ముద్ర మద్యసేవనంలో ఒక అంగం కనుక మకారత్రయమే శరణ్యంగా భావింపబడుతూన్నది. ఈ సాధనతో కాళీమాత ప్రసన్నురా లవుతుందని వామాచారపరాయణుల విశ్వాసం. అస్తు. తథాపి ఈ సాధకుడు ఈ విధమైన పద్ధతిని అనుసరించటంలో, తాను ప్రారంభంలో భావించిన భోగనిరాసక్తత క్రమంగా తొలగి భోగాసక్తత పెరిగి స్థిరమై, ఆతడు కేవల భోగిగా మారి అదే శాక్తేయం అనే భావనలో పతనమయ్యే అవకాశం చాల అధికం. కనుకే వీరభావ వామాచారం నింద్యంగా చెప్పబడింది. ఈ పంచమకారాలు దేవతాప్రీతికరాలని అంగీకరిస్తూనే, అది తృష్ణవలన చేయబడినదైతే పాతకమవుతుందని కులార్ణవతన్త్రం హెచ్చరించటం గమనార్హం :

శ్లో॥ మాదిపంచకమీశాని దేవతాప్రీతయే సుధీః ।
యథావిధి నిషేవేత తృష్ణయా చేత్ స పాతకీ ॥

ఈ మకారపంచకం మానవ స్వాభావిక ప్రవృత్తి కనుక వానిని దోషాలుగా పరిగణించ నక్కరలేదని అంటూనే మనువు, ఈ ప్రవృత్తిమార్గాన్ని విడచి నివృత్తిమార్గానుసారియైన వాడు మహానుభావుడనీ, వాని సాధనల ఫలం కూడా దివ్యమైనదిగా ఉంటుందంటాడు:

శ్లో॥ న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే ।
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా ॥

వైదికమతంలో కూడ ఈ ప్రవృత్తిమార్గాన్ని పూర్తిగా నిషేధించక యాగాదులకు

పరిమితం చేస్తూ, తన్త్రశాస్త్ర ప్రయోజనం ప్రవృత్తినుండి నివృత్తిమార్గంలో శక్తిసాధనేనని నిర్ణయం. ఐనను శాక్తేయం ప్రకారం భోగయోగాలు కలిసే ఉంటాయని నిర్ణయం :

శ్లో॥ యత్రాస్తి భోగో న చ తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో న చ తత్ర భోగః ।
శ్రీసుందరీపూజనతత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥

ఇది అసంభవం అని తేల్చటం ముఖ్యం కాదు, కాని ఇది సర్వసాధ్యమార్గం కాదు. శ్రీకృష్ణునంతటి మహాపురుషులకు సాధ్యం. సామాన్య సాధకులకు మాత్రం ఈ మార్గం ఫలాగ్రం కాదని ఘంటాపథంగా చెప్పవచ్చు. వామాచారులు నాగరిక సమాజ బాహ్యులు, నాగరిక న్యాయం ప్రకారం దండ్యులు అవుతారు. ఇంత కఠినాతి కఠినమార్గాన్ని అనుసరించి, ప్రలోభాలను, భోగాసక్తిని, అధిగమించి ప్రవృత్తిమార్గంలో పయనిస్తూ ఆత్మిక నివృత్తిని సాధించగలిగిన మహాత్ములు సాక్షాత్ శివసమానులు. **కులార్ణవతన్త్రం** అన్నట్లు,

శ్లో॥ మద్యపానేన మనుజో సిద్ధిం లభేత వై ।
మద్యపానరతాస్సర్వే సిద్ధిం గచ్ఛన్తు పామరాః ।
మాంసభక్షణమాత్రేణ యది పుణ్యా గతిర్భవేత్ ।
లోకే మాంసాశినః సర్వే పుణ్యభాజో భవన్తి హి ।
శక్తిసమ్భోగమాత్రేణ యది మోక్షో భవేత వై ।
సర్వేఽపి జన్తవో లోకే ముక్తాః స్యుః స్త్రీనిషేవణాత్ ॥

**వామాచారం** కౌలిక, వామ, చీనక్రమ, సిద్ధాన్త, శావర విభేదాలతో ఐదు విభాగాలతో ఉంటుంది. కొందఱాచార్యులు దీనిని మహానీల, నిష్కలనీల, గంధర్వ, సౌభాగ్య, బ్రహ్మమార్గక్రమములని ఐదు క్రమాలుగా విభజించి, వీనిలో చివరి మూడు క్రమాలున్నూ వీరసాధకులైన ఉచ్చకోటికి చెందినవని అంటారు.

కామనలు లేకుండ, యే ధర్మానికీ కట్టుబడకుండ మనస్ఫూర్తిగా ఇష్టంగా ఆ భగవతి దక్షిణకాలికను భక్తితో సేవించేవానిని **దక్షిణాచారి** అంటారు, వాని ఆచారమే దక్షిణాచారం. అయితే, వేదం యే వర్ణాని కే ఆచారం విహితమని ప్రతిపాదించినదో, దానిననుసరించటం ధర్మంగా వీరు భావిస్తారు. వీరున్నూ పంచమకారాలను, లేక పంచతత్త్వాలను అనుకల్పంచేసి పూజిస్తారో వారు శివస్వరూపులై శక్తిని ఉపాసిస్తారు.

**దక్షిణాచారమన్నది** సాధకులకు ప్రారంభికావస్థలో అవసరమే అని కొందరు తాంత్రికుల మతం. దీనివలన సాధకుని మనస్సు సదాచారంపట్ల ఆదరణను కలిగి ఉంటుంది. ఈ మార్గంలోని సాధకులు ప్రాతః స్నానసంధ్యావందనాది శ్రౌతస్మార్త కర్మలనాచరిస్తూ, మధ్యాహ్నం జపము చేస్తూ ఉపాసిస్తారు. పశుపదప్రయోగం ద్వారా ఈ శ్లోకంలో దక్షిణాచారం సూచింపబడుతూన్నది. కనుకే సాధకులు పులితోలు, జింక తోలు, ఇత్యాదులను ఆసనంగా చేసికొని జపం చేస్తారు. రుద్రాక్షజపమాలలు, స్ఫటికమాలలు ఉపయోగిస్తారు. భోజనంగా చక్కెర పాయసం ఇత్యాది మధురపదార్థాలు, మైథునానికి భార్యయే శక్తిస్వరూపిణిగా సాధన సాగుతుంది.

దక్షిణాచారం మన్ననలకు పాత్రమైనదే, అయినప్పటికి, దానిని వామాచారులు విరోధిస్తుంటారు. దివ్యభావమో లేక వీరభావమో లేకుండా కాళీపూజ చేయరాదంటారు. కుంచికాతన్త్రం, **పశుభావరతా యే చ కేవలం పశురూపిణః,** పశుభావంలో ఉపాసించేవారు పశువులుగానే ఉండిపోతారని నిష్కర్షగా చెప్పింది. కాని, **న ఖలు పశురోషః సముచితః**, అన్న ఈ శ్లోకవచనమే పశుభావంలో కాళీ ఆరాధనను చెబుతూన్నది. పిచ్ఛిలాతన్త్రం ప్రకారం మద్య, మాంస, మీన, ముద్రా, మైథునాలను **అనుకల్పం** ద్వారా ఆచరించవచ్చు. ఈ అనుకల్పప్రకారమిట్లా :

**1. మద్యానుకల్పం :** నారికేలోదకం, తక్రంగుడసమన్వితం, గుడాన్నం, గోక్షీరం, తాంబూలం, ఖర్జూరరసం, లవణఘృతాన్నం, భంగు.

**2. మాంసానుకల్పం :** లవణార్ద్రకపిన్నాకస్తిలగోధూమమాషకాః ।
లశునం చ మహేశాని మాంసప్రతినిధిః స్మృతః ॥
– నిరుక్తరతన్త్రం

**3. మీనానుకల్పం :** నారికేళం, **శ్రీఫలం,** ధాత్రీఫలం, హరీతకీ, వీనిని కాల్చినట్లయితే మీన సమానం, అని భావచూడామణి.

**4. ముద్రానుకల్పం :** నీరు, ఉప్పు లేకుండా వేయించిన బియ్యం లేక శనగలు. అయితే, ముద్రాశబ్దానికి, ముదం హర్షం రతి దదాతి ఇతి ముద్రా, అన్న వ్యుత్పత్తిని సూచించి, ముద్ర అన్నది యోజనామూలమైన వ్రేళ్ళ భంగిమలు దేవప్రీతిని కలిగిస్తాయని, అదే నిర్దిష్టార్థమనీ కొన్ని గ్రంథాలు వివరించినవి. ఈ ముద్రలు వివిధ తన్త్రానుసారం ఇట్లా పేర్కొనబడినవి :

తంత్రసారంలో : సమ్ముఖ, సంపుట, వితత, విస్తృత, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖ, షణ్ముఖ, అధోముఖ, వ్యాపకాంజలిక, శకట, యమపాశ, గ్రథిత, సమ్ముఖోన్ముఖ, ప్రలంబ, ముష్టిక, మత్స్య, కూర్మ, వారాహ, సింహాక్రాన్త, మహాక్రాన్త, ముద్గర, పల్లవ. (మొత్తం 24).

స్వచ్ఛందతంత్రంలో : కపాల, ఖట్వాంగ, ఖడ్గ, స్ఫర, అంకుశ, పాశ, నారాచ, పినాక, అభయ, వర, ఘంటా, త్రిశూల, దండ, వజ్ర, డమరు, ముద్గర, వీణా, పరశు. (మొత్తం 18).

వీనితో అనుసంధానం చేయవలసిన ముద్రలు 8 : సురభి, జ్ఞాన, వైరాగ్య, యోని, శంఖ, పంకజ, లింగ, నిర్వాణ.

**5. మైథునానుకల్పం :** పశూనాం మైథునం నాస్తి చిన్తనం పరికల్పితమ్ ।
సహస్రారే మహాపద్మే శివశక్తిసమన్వితమ్ ।
తేనామృతేన పరమే తర్పయేత్ పరదేవతామ్ ॥
**– భావచూడామణి.**

పశుభావంలో ఆరాధించే వారికి మైథునం నిషిద్ధం. దాని అనుకల్పం చిన్తనం విధి. పరదేవతను సహస్రారమహాపద్మంలో శివశక్తిసమన్వితంగా పరమామృతంతో తృప్తిపర్చవలెను.

ఇక **దివ్యభావం** లేక **కులాచారంలో సాధన**గూర్చి పరిశీలించుదాము. ఈ ఆచారాన్ననుసరించి, సాధకుడు మూలాధారం మొదలు సహస్రారం వరకు గల ఆరు చక్రాల లేక పద్మాల అధిష్ఠాతృదేవతలను, ఆజ్ఞాచక్రంలో హంసపీఠంపై కులగురువును, కులకుండలినీ స్వరూప దేవతను నిత్యం అర్చించే విధి ననుసరించేవాడు. వానిని కులాచారియని, దివ్యమార్గియనీ అంటారు. అతని సాధనపద్ధతి కులాచారం అనబడుతుంది. ఈ మార్గంలో పయనించే సాధకుడు యోగి అవుతాడని **రుద్రయామల** మిట్లా వివరించింది :

శ్లో॥ కులాచారం ప్రవక్ష్యామి సేవ్యం యోగిభిరుత్తమైః ।
కులస్త్రియం కులగురుం కులదేవీం మహేశ్వరి ।
నిత్యం యః పూజయేద్విశ్వం స కులాచార ఉచ్యతే ॥

ఈ దివ్యసాధకుడు పతంజలి, గోరక్షానాథాది యోగమార్గంలో సాధనచేస్తారు.

వీరూ పంచమకారాలను సేవిస్తారు కాని అవి భౌతికమైనవి కావు. వీరి మతంలో మద్యం అంటే, మూలాధారం నుండి కుండలిని విజృంభించి బ్రహ్మరంధ్రం చేరి అక్కడ సహస్రారచక్రంలో పరబ్రహ్మనుగూడి యే సుఖాన్ని అనుభవిస్తుందో, అది వ్యోమపద్మం లేక సహస్రారపద్మంలోని అమృతం, అదే మద్యం. అది మాదకద్రవ్యం కాదు. అట్లే వీరి మతంలో మాంసం అంటే, పుణ్యపాపరూప పశువును వివేకరూపఖడ్గంతో ఖండించి, చిత్తాన్ని సాధకుడు పరాశక్తియందు లయం చేయటమే మాంసం. ఇదిన్నీ పదార్థంకాదు, ప్రాణిహింసలేదు.

శ్లో॥ న మద్యం మాధవీమద్యం మద్యం శక్తిరసోద్భవమ్ ।

**– శక్తిసంగమతన్త్రం**

శ్లో॥ పుణ్యాపుణ్యపశుం హత్వా జ్ఞానఖడ్గేన యోగవిత్ ।
పరే లయం నయేచ్ఛిత్తం పలాశీ స నిగద్యతే ॥

**– కులార్ణవతన్త్రం.**

కులాచారంలో మీనభక్షణాన్ని గురించి **కులార్ణవతన్త్రం** ఇట్లా వివరించింది :

శ్లో॥ మనసా చేంద్రియగణం సంయమ్యాత్మని యోజయేత్ ।
మత్స్యాశీ స భవేద్దేవి శేషాః స్యుః ప్రాణహింసకాః ॥

మనస్సుతో ఇంద్రియాలను నిగ్రహించి ఆత్మయందు లగ్నం చేసినవాడే మత్స్యభక్షకుడు, మిగతవారు ప్రాణిహింసకులు, అని. **ఆగమసారం** మరింత వివరంగా ఇట్లా అంటుంది:

శ్లో॥ గంగాయమునయోర్మధ్యే మత్స్యౌ ద్వౌ చరతః సదా ।
తౌ మత్స్యౌ భక్షయేద్యస్తు స భవేన్మత్స్యసాధకః ॥

అనగా, గంగాయమునలమధ్య రెండు మీనాలు ఎప్పుడూ తిరుగుతూంటాయి. ఆ చేపలను తిన్నవాడే మత్స్యసాధకుడు, అని. ఇక్కడ చెప్పబడిన గంగాయమునలు ఇడా పింగళనాడులు. వీనిలో ఉచ్ఛ్వాస నిఃశ్వాసలు అనబడేవి నిరంతరం చరిస్తూండే మీనాలు. వీనిని ప్రాణాయామంలోని కుంభకక్రియతో పట్టి ఆహరించే ఆ సాధకుడే నిజమైన మీనభక్షకుడు, అని.

**ముద్ర** అన్నదానిని ఆగమసారమిట్లా వివరిస్తుంది :

శ్లో॥ సహస్రారే మహాపద్మే కర్ణికాముద్రితశ్చరేత్ ।
ఆత్మా తత్రైవ దేవేశి కేవలః పారదోపమః ।

సూర్యకోటిప్రతీకాశః చంద్రకోటిసుశీతలః ।
అతీవ కమనీయశ్చ మహాకుండలినీయుతః ।
యస్య జ్ఞానోదయస్తత్ర ముద్రాసాధక ఉచ్యతే ॥

సహస్రారపద్మపు కర్ణికలో గుప్తమై పాదరసంతో పోల్చదగినదై, కోటిసూర్యప్రభతో కోటి చంద్రశీతలమై కమనీయమైన ఆత్మ వెలుగుతూంటుంది. ఈ ఆత్మతో కుండలినిని చేర్చగల జ్ఞానం కలిగిన సాధకుడు ముద్రాసాధకుడవుతాడు. భైరవయామలానుసారం, దివ్యభావసాధకుడు తనలోని ఆశ, తృష్ణ, జుగుప్స, భయ, ఘృణ, మాన, లజ్జా క్రోధాలు అనబడు అష్టముద్రలను బ్రహ్మాగ్నిలో వ్రేల్చి రుద్రసమానుడవుతాడు. ఈ అష్టముద్రలున్నూ అష్టవిధ పాశాలరూపాలే. ఈ పాశాలను తెగనాడినప్పుడే సాధకుడు ముద్రను సాధించినవాడు.

కులాచారంలో **మైథునం** అంటే,

శ్లో॥ పరాశక్త్యాత్మమిథునసంయోగానందనిర్భరః ।
య ఆస్తే మైథునం తత్ స్యాదితరే స్త్రీనిషేవకాః ॥

అన్న ఆగమసారతంత్రోక్తి ననుసరించి, ఆత్మ – పరాశక్తి కలిసి మిథునం కాగా, వారి సంయోగానందమే మైథునం. దైహికమైథునం ఇంద్రియలాలసమాత్రమే. దీన్ని సాధించాలంటే, సాధకుడు సుషుమ్నానాడిని సేవించాలి, కౌగలించాలి, ఇడాపింగళల యోగంలో రమించాలి. వీరభావోపాసకులు తఱచు స్మరించే యీ శ్లోకార్థాన్ని భౌతికంగా కాక సాంకేతికంగా భావించాలి. ఆ శ్లోకం :

శ్లో॥ మాతృయోనౌ క్షిపేల్లింగం భగిన్యాః స్తనమర్దనమ్ ।
గురోర్మూర్ధ్ని పదం దత్వా పునర్జన్మ న విద్యతే ॥

ఈ శ్లోకాన్నిట్లా **యౌగికార్థం**లో భావించాలి : జీవాత్మ మూలాధారచక్రంలోని స్వయంభూ లింగ సమేత త్రికోణమునందు ప్రవేశించి కుండలినీశక్తిని గూడి ఊర్ధ్వదిక్కుగా సాగి, ద్వాదశదళచక్రంపై నిలిచి (కాలూని) సహస్రారచక్రంలో చేరి శివశక్తి దర్శనం చేయవలె. దివ్యాచారు లీ శ్లోకానికిచ్చిన అర్థమిది. ఈ అన్వయంలో లింగశబ్దానికి జీవాత్మయని, మాతృయోని అనగా మూలాధారంలోని స్వయంభూలింగ సహిత త్రికోణమనిన్నీ, జీవాత్మకు సహోదరియైన కుండలినియే భగినీశబ్దార్థమనిన్నీ, ద్వాదశదళపద్మము గురునివాసమైన ఆజ్ఞాచక్రమనిన్నీ, దానిపైనున్న సహస్రారం జీవాత్మకు గమ్యమైన లక్ష్యం అనిన్నీ, ఇట్లా సాంకేతికమైన అర్థాలు వివరింపబడినవి.

సంక్షిప్తంగా ఈ ఆచారత్రయ వివేచన ఇట్లా చేయవచ్చు : **(1) వామాచారం:** ఇది ఘోరమైన ప్రవృత్తి మార్గం. వీరు పంచమకారాలపేరిట మద్యమాంససేవనం, పరకాన్తా సంభోగం నియమంగా పాటించి ఇంద్రియభోగలాలసను సంభావిస్తూ, ప్రచ్ఛన్న (గృహస్థ), అవధూత భేదాలతో వామమార్గాన్ని, కౌలమార్గాన్ని అనుసరిస్తూంటారు. **(2) దక్షిణాచారం :** వీరు శృతి స్మృతి విహితమైన మార్గాన సాధన చేస్తారు. వీరు మద్యం స్థానంలో భంగ్ సేవిస్తారు. వీరు మైథునక్రియకు స్వస్త్రీగమనాన్నే శక్తిసాధనగా స్వీకరిస్తారు. కొందఱు పంచమకారాలను అనుకల్పంద్వారా సేవించి దక్షిణాకాళికను పూజిస్తారు. వీరిలో సురక్తులు, విరక్తులు, అని రెండు భేదాలు. విరక్తులు దివ్యమార్గానుసారులవుతారు. **(3) దివ్యాచారం :** వీరు నివృత్తి మార్గంలో సాధన చేస్తారు. పంచ మకారాలకు భౌతికార్థాలను తిరస్కరించి యౌగికార్థాలను ప్రతిపాదిస్తారు. వీరారాధించే శక్తి కుండలిని.

ఇవి జగన్మాత కాళికాతత్త్వజ్ఞానం సమగ్రంగా లేని కారణంగా (సమగ్రజ్ఞానం దేవదానవమానవులలో ఎవరికీ ఉండటం వస్తుతః అసంభవం) సాధకులు అనుసరిస్తూన్న మార్గాలు. అందుకే **ముఖరయతి,** వాగిస్తూన్నది, అన్న పదప్రయోగం. దానికి ప్రేరకమే **జడధియః** అన్న ప్రయోగం. అవగాహనలో ఆచారాలలో దోషాలుండవచ్చు, కాని మా భక్తిభావనలో దోషం లేదు కనుక అపచారం క్షంతవ్యమే, అంటాడు కవి.



**శ్లో॥ సమన్తాదాపీనస్తనజఘనదృగ్యౌవనవతీ -**
**రతాసక్తో నక్తం యది జపతి భక్తస్తవ మనుమ్ ।**
**వివాసాస్త్వాం ధ్యాయన్గలితచికురస్తస్య వశగాః**
**సమస్తాః సిద్ధౌఘా భువి చిరతరం జీవతి కవిః ॥ 10**

**అన్వయక్రమం :** సమన్తాదాపీనస్తనజఘనదృగ్యౌవనవతీరతాసక్తః భక్తః నక్తం గలితచికురః వివాసాః త్వాం ధ్యాయన్ తవ మనుం యది జపతి, సమస్తాః సిద్ధౌఘాః తస్య వశగాః భువి చిరతరం జీవతి కవిః ।

**ప్రతిపదార్థం :** సమన్తాత్ = పూర్తిగా, ఆపీన = బాగుగా బలిసిన, స్తన = చన్నులు, జఘన = పిఱుదులు, దృక్ = కన్నులు, కలిగిన, యౌవనవతీ = యౌవనముగల దానితోడి, రత = సంభోగమునందు, ఆసక్తః = ఆసక్తిగల, భక్తః = భక్తుడు, నక్తమ్ = రాత్రివేళ, గలిత = జారిన, విరబోసిన, చికురః = జుత్తుగలిగి, వివాసాః = దిగంబరుడై,

త్వామ్ = నిన్ను, ధ్యాయన్ = ధ్యానించుచు, తవ = నీయొక్క, మనుమ్ = మంత్రమును, యది జపతి = జపించినచో, సమస్తాః సిద్ధౌఘాః = సిద్ధులందఱును, తస్య = వానికి, వశగాః = వశులౌదురు, (సః = వాడు) కవిః = కవి, (భూత్వా = అగుచు), భువి = భూమిపై, చిరతరమ్ = చాలకాలము, జీవతి = జీవించును.

**తాత్పర్యం :** పెద్దవిగానున్న చన్నులు, పిఱుదులు, కన్నులు కలిగిన యౌవనవతితో సంభోగించుటకు ఆసక్తిగల భక్తుడు రాత్రివేళ జారవిడిచిన జుత్తుతో దిగంబరుడై నిన్ను ధ్యానించుచు, నీ మంత్రమును జపించినచో సిద్ధసంఘము వానికి వశులగుదురు. ఆతడు కవియై చాలకాలము జీవించును.

త్వాం ధ్యాయన్, నిన్ను ధ్యానించుచు, అనుటను బట్టి సందర్భానుసారి, హే మాతః, ఓ తల్లీ!, అన్న సంబోధన గ్రాహ్యము. ఈ తల్లి దక్షిణకాళిక. తవ మనుం యది జపతి, నీ మంత్రమును జపించినచో, అనటంలో, **క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణేకాళికే క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా**, అను ద్వావింశత్యక్షరీవిద్యారాజ్ఞీమంత్రజపముద్దిష్టము.

ఈ శ్లోకాన్ని మరొక విధంగానూ అన్వయించటం సాధ్యమే. ఈ అన్వయ క్రమంలో, ద్వావింశత్యక్షరీ మంత్రజపాన్ని ధ్యానంనుండి వేరుచేసి, **అథవా,** లేకున్నచో, అని అధ్యాహారం చేసి, యౌవనవతితో సంభోగాసక్తితో జపానికి ప్రత్యామ్నాయంగా జుత్తు విరబోసికొని దిగంబరంగా యోనిస్వరూపగా ఆ భగవతిని ధ్యానించటం చెప్పవచ్చు. సిద్ధౌఘాః అని చెప్పబడినవారు సిద్ధులనబడు ఒక జాతి దేవయోనులు. ఈ అన్వయంలో రెండువిధాలుగా సాధన చెప్పబడింది, అన్నది గ్రాహ్యం. ఈ రెండు విధాల సాధన ఈ కర్పూరస్తవరాజంలోనే అన్యత్రకూడ ప్రస్తావించబడింది. ఫేత్కారిణీతన్త్రం ఈ సాధనలను సమర్థిస్తూన్నది. ఇది సరికాదని, ఇక్కడ వర్ణింపబడినది ఒకే విధమైన సాధనయని కొందఱు తాంత్రికుల అభిప్రాయం.

ఇంతవరకు వామాచర దక్షిణాచార పరమైన అన్వయం చెప్పబడింది. దివ్యాచారపరంగా అర్థప్రతిపాదనమిట్లా : నక్తం అన్నది నిద్రాస్థితప్రాణిజగత్తును సూచించగా భక్తుడు మాత్రం జాగ్రదావస్థలో నున్నవాడు. అనగా, లోకమంతా తమ ఉనికిలోని సత్యాన్ని మరచి అజ్ఞానస్థితిలో మాయావరణంలో నుండగా, భక్తుడు మాత్రం జ్ఞానమార్గంలో జాగరూకుడై కుండలినీశక్తితో విహరిస్తూంటాడు, నిరామయుడై ఉంటాడు, జీవాత్మను పరమాత్మతో చేర్చి ఆ సంయోగానందంలో ఉంటాడు. ఇక్కడ

వర్ణింపబడిన యౌవనవతి సర్వకాలషోడశవర్షీయగా చెప్పబడే కుండలినీశక్తి. వివాసః అను దిగంబరత్వం భౌతికం కాదు, **మనస్సును మాయావరణం నుండి తప్పించిన స్థితి. గలితచికురః** అన్నది **చిత్తచాంచల్యరాహిత్యం.** అట్టి నిర్మలమనస్కుడై కుండలినీశక్తియుతుడై జీవాత్మపరమాత్మైక్య సమాధిలో చేరినవాడు ఇక్కడ చెప్పబడిన భక్తుడు. **తన్త్రకల్పద్రుమం**లో కుండలిని ఇట్లా వివరించబడింది :

శ్లో॥ ధ్యాయేత్కుండలినీం దేవీమ్ ఇష్టదేవస్వరూపిణీమ్ ।
సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్ ।
శ్యామాం సూక్ష్మాం సృష్టిరూపాం సృష్టిస్థితిలయాత్మికామ్ ॥

**గోరక్షసంహిత** ఇట్లా అంటుంది :

శ్లో॥ జీవేన సహితాం శక్తిం సముత్థాయ శిరోంబుజే ।
స్వయం శక్తిమయో భూత్వా పరశివేన సంగమమ్ ।
నానాసుఖం విహారం చ చిన్తయేత్ పరమం పదమ్ ॥

జీవాత్మతో కులకుండలినీశక్తిని సహస్రారచక్రంలో చేర్చి, తద్ద్వారా తాను శక్తిమయుడై పరమశివునితో సంగమించి వివిధసుఖమయవిహారాన్ని భావించటమే పరమపదం. ఈ సంగమం బాహ్యరతికాగా సుఖమయవిహారభావన అభ్యంతర, లేక, రహస్య రతి.



**శ్లో॥ సమాః స్వస్థీభూతాం జపతి విపరీతాం యది సదా**
**విచిన్త్య త్వాం ధ్యాయన్నతిశయమహాకాలసురతామ్ ।**
**తదా తస్య క్షోణీతలవిహరమాణస్య విదుషః**
**కరామ్భోజే వశ్యా హరవధు! మహాసిద్ధినివహాః ॥** **11**

**అన్వయక్రమం :** (హే) హరవధు విపరీతాం స్వస్థీభూతామ్ అతిశయమహాకాలసురతాం త్వాం విచిన్త్య సమాః సదా ధ్యాయన్ జపతి యది తదా తస్య క్షోణీతలవిహరమాణస్య విదుషః కరాంభోజే మహాసిద్ధినివహాః వశ్యాః (భవన్తి) ॥

**ప్రతిపదార్థం :** (హే) హరవధు = ఓ శివుని ప్రియురాలా!, విపరీతామ్ = లోకాచార విరుద్ధమైనదానిని, స్వస్థీభూతామ్ = శాంత, నిర్వికారమైనదానిని, అతిశయ = మిక్కిలి, మహాకాల = మహాకాలునితో, సురతామ్ = ఆనందించినదానిని, త్వామ్ = నిన్ను, విచిన్త్య = విశేషముగ మనసుంచి, సమాః = సమబుద్ధిగలవారు, సదా = ఎల్లప్పుడును,

ధ్యాయన్ = ధ్యానించుచు, జపతి యది = జపించినచో, తదా = అప్పుడు, క్షోణీతల = భూమిపై, విహరమాణస్య = విహరించుచున్న, తస్య విదుషః = ఆ పండితునియొక్క, కరాంభోజే = పద్మమువంటి అరచేతిలో, మహాసిద్ధినివహాః = మహాసిద్ధుల సమూహము, వశ్యాః (భవన్తి) = వశమగుచున్నది.

**తాత్పర్యం :** అమ్మా! శివప్రియా! లోకాచారవిరుద్ధరూపంతో నిర్వికారానందాన్ని మహాకాలుని కలిసిపొందే నిన్ను విశేషంగా మనసు పెట్టి సర్వావస్థలలోను ధ్యానిస్తూ జపించే సమబుద్ధిగల పండితునకు మహాసిద్ధులన్నియు కరతలామలకములై వశవర్తులగుచున్నవి.

**హరవధు** అని కాళీమాతను సంబోధించటంలో అంతరార్థం ఆమె నాథుడు ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధిమానసిక తాపత్రయాన్ని హరించే దేవదేవుడని. ఆమె కాళి కనుక ఆతడు మహాకాలుడు. ఇద్దరున్నూ కాలస్వరూపులే. కాలపురుషుడాతడు, కాలశక్తి ఆమె. ఆ శక్తిని విపరీతాం అని కవి ఎందుకన్నాడో క్రిందటి 10 శ్లోకాలలోని ఆమె స్వరూపవర్ణనను గుర్తుదెచ్చుకుంటే బోధపడుతుంది. **వి అన్న ఉపసర్గకుగల రాహిత్యార్థాన్ని గుర్తిస్తే, ఆమె ఆవరణలేమీ లేనిది అనిన్నీ కనుకే స్వస్థీభూతయైన ఆనందమయి యనిన్నీ అర్థమవుతుంది.** ఆమె ఆనందమయి కావటానికి కారణం, తన నాథునితో కలిసి యుండటం, అనగా శివశక్తిసంయోగం చెప్పబడింది. ఆ స్వరూపం సర్వమంగళప్రదం, సర్వార్థసిద్ధిదం. సాలోక్య, సామీప్య, సారూప్య, తాద్రూప్య, కైవల్యములనబడు ముక్తి పంచకంలో దేనినైనా పొందగలడు సాధకుడామెను ధ్యానించి ద్వావింశత్యక్షరీమంత్రాన్ని ఏకాగ్రతతో జపించుటకు ఫలంగా. అట్టి సాధకునిలో సాధన ఫలించాలంటే దశగుణము లుండవలె నంటుంది **కులార్ణవతన్త్రం** :

శ్లో॥ శాన్తశ్శుచిర్మితాహారో భూశాయీ భక్తిమాన్వశీ ।
నిర్ద్వన్ద్వః స్థిరధీర్మౌనీ సంయతాత్మా జపేత శివే ॥

అనగా, సమయాచార సాధకుడు శాన్తుడై, శుచియై, మితభోజనుడై, భూశయనుడై, భక్తిగలవాడై, ఇంద్రియాలను వశమందుంచికొన్నవాడై, స్థిరమైన బుద్ధిగలిగి, మౌనము పాటించుచు, ఆత్మనిగ్రహము గలిగి జపించవలెను, అని.

జపాన్ని గురించి కూడ కొంత తెలియటం అవసరం. తన ఇష్టదేవతకు సంబంధించిన మంత్రాన్ని మనస్సు లగ్నం చేసి మరల మరల ఆవృత్తి చేయటాన్ని జపించటం అని అంటారు. **భూతిశుద్ధితన్త్రం,**

**శ్లో॥ యస్య యస్య చ మన్త్రస్య ఉద్దిష్టా యా చ దేవతా ।**
**చిన్తయిత్వా తదాకారం మనసా జపమాచరేత్ ॥**

అంటుంది. అనగా, యే యే మన్త్రానికి యే దేవత అధిష్ఠాతగా శాస్త్రనిర్ణయమో ఆ దేవతా రూపాన్ని మనస్సులో ప్రతిష్ఠించికొని, ఆమెనే భావిస్తూ, ఆ నిర్దిష్టమంత్రాన్ని పదే పదే పలుకుతూండవలె. మంత్రబీజాక్షరాలకూ దేవతలకూ విడరాని సంబంధ మున్నదని ముందే చూచినాము కదా, ఆ మంత్రజపం ద్వారా ఆ దేవతాశక్తిని మేలుకొల్పే ప్రయత్నం జపానికి లక్ష్యం. దక్షిణకాళికా మంత్రరాజ్ఞి లేక విద్యారాజ్ఞి ద్వావింశత్యక్షరీమంత్రం, అని ముందే తెలుసుకున్నాం. ఇక జపమన్నది వాచిక, ఉపాంశు, మానస భేదాలతో మూడు విధాలుగా ఉంటుంది. **వాచికజపంలో** మంత్రోచ్చారణ నోటితో బిగ్గరగా వినబడేట్లు చేయబడుతుంది. తనకే కాక చుట్టూ ఉన్నవారికి కూడ వినవస్తుంది. **ఉపాంశుజపంలో** మంత్రాన్ని జపించేవాని నాలుక, పెదవులు, పలువరుస కూడా కనిపిస్తుంది, కదలికలు తెలుస్తూ ఉంటాయి, దగ్గఱ నున్నవారికి కొంత ధ్వని కూడా వినిపిస్తుంది కాని అక్షరస్పష్టతమాత్రం ఉండదు. **మానసజపంలో** పలువరుస కనరాదు, పెదవులు నాలుక కదలికలుండవు, ముఖంలో సైతం యే వికారమూ కన్పించదు, ఆతడు జపిస్తూన్న మంత్రమేదో గ్రహించదగిన గుర్తులేమీ ఉండవు. అతడు నిశ్చలంగా ఊరకే కూర్చున్నట్లుంటుంది. ఒకవేళ, జపమాల చేతులో కదులుతూంటే, దానిని బట్టి ఆతడు జపం చేస్తూన్నాడని తెలుస్తుంది.

ఈశ్లోకాన్నీ క్రిందటి శ్లోకాన్నీ పరిశీలిస్తే కొన్ని విషయాలు దక్షిణకాళికారాధన సంబంధంగా తెలుస్తాయి. అవి : 1) స్వస్త్రీ లేక పరస్త్రీసంభోగంలో ఉండి సాధన చేయవచ్చు, 2) స్త్రీసంగమం లేకుండ యోనిధ్యానంతో సాధన చేయవచ్చు, 3) ఈ ఆరాధనలో దిగంబరత్వమూ జుత్తు విరబోసికొనటం అవసరం, 4) స్త్రీసాహచర్యం లేకుండగ ఏకాకిగ సాధన చేయవచ్చు, 5) చెప్పబడిన వానిలో యే ఆచారమైనా పాటిస్తూ సాధన చేయవచ్చు.

**శ్లో.9 నుండి 20 వరకు శ్లోకవిషయక్రమం ఇట్లా ఉన్నది : శ్లో9లో సాధనారంభం; శ్లో.10, 11 లలో సాధన ప్రతిపాదన, శ్లో.12-14 లలో దేవతాస్తుతి, శ్లో.15, 16 లలో రేతస్సుతో తడుపబడిన పదార్థంతో శ్మశానంలో హవనం; శ్లో.17లో యోనిధ్యాన నిమగ్నజపవిధానం; శ్లో.18లో సురతాసక్తుడై యుండి ధ్యానం; శ్లో.19లో బలివిధానం; శ్లో.20 హవిర్భోజనంతోను, సురతంతోను జపించడం.**



## 4. స్తుతిప్రకరణము

**శ్లో॥ ప్రసూతే సంసారం జనని! జగతీం పాలయతి చ**
**సమస్తం క్షిత్యాది ప్రలయసమయే సంహరతి చ ।**
**అతస్త్వాం ధాతాపి త్రిభువనపతిః శ్రీపతిరపి**
**మహేశోఽపి ప్రాయః సకలమపి కిం స్తౌతి భవతీమ్ ॥ 12**

**అన్వయక్రమం :** (హే) జనని! సంసారం ప్రసూతే జగతీం పాలయతి చ చ ప్రలయసమయే సమస్తం క్షిత్యాది సంహరతి అతః ధాతా అపి త్రిభువనపతిః శ్రీపతిః అపి మహేశః అపి ప్రాయః సకలమపి త్వాం భవతీం కిం స్తౌతి ॥

**ప్రతిపదార్థం :** (హే) జనని = ఓ తల్లీ!, సంసారమ్ = ప్రపంచమును, ప్రసూతే = ప్రసవించినావు, జగతీమ్ = ప్రపంచమును, పాలయతి చ = రక్షించుచున్నావుకూడ, చ = వేరొకవంక, ప్రలయసమయే = ప్రళయకాలమున, క్షితి + ఆది (క్షిత్యాది) = భూమి మొదలగు, సమస్తమ్ = అన్నిటిని, పూర్తిగా, సంహరతి = నశింపజేయుచున్నావు, అతః = అందుచే, ధాతా అపి = బ్రహ్మయైనను, త్రిభువనపతిః = ముల్లోకముల ఏలికయైన, శ్రీపతిః అపి = లక్ష్మీనాథుడగు విష్ణువైనను, మహేశః అపి = మహేశ్వరుడైనను, ప్రాయః = బహుశః, సకలమ్ + అపి = కళలతో కూడియున్న దానవైనను, త్వాం భవతీమ్ = పూజ్యురాలవగు నిన్ను, కిం స్తౌతి = ఏమి స్తుతించును?

**తాత్పర్యం :** అమ్మా! ప్రపంచాన్ని సృష్టించినదానవు నీవు, పోషించుదానవును నీవే. వేరొకప్రక్క, ప్రళయకాలమున భూమి మొదలైన సమస్త గ్రహరాశులను నామరూపములు లేకుండ ఉపసంహరించికొనుదానవును నీవే. ఈ కారణమువలననే, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, ఎవరైనను ప్రకృతిగా కళలతో ప్రకటమవుతూన్ననూ, అంతటి పూజ్యురాలవగు నిన్ను ఏమి స్తుతింపగలడు?

సృష్టికర్త బ్రహ్మ, భర్త విష్ణువు, హర్త రుద్రుడు అని కదా మూర్తిత్రయభావన! మరి ఈ మూడు కార్యాలనూ దక్షిణకాళికయే చేస్తుందని కవి మహాకాలుడనటంలో ఆంతర్యం? కవి వాక్కును సమర్థించే **సప్తశతి** వాక్యమిట్లా ఉన్నది :

శ్లో॥ త్వయైతద్ధార్యతే విశ్వం త్వయైతత్సృజ్యతే జగత్ ।
త్వయైతత్పాల్యతే దేవి త్వమస్త్యన్తే చ సర్వదా ॥

కర్త బ్రహ్మయైనప్పటికీ వాని సృజనశక్తి వాని మానససరోవరవర్తి సరస్వతి ఆ దేవి

కళయే. భర్త విష్ణువైనప్పటికీ వాని భర్తృశక్తి వాని హృదయవర్తి శ్రీమహాలక్ష్మి ఆ దేవి కళయే. హర్త రుద్రడేయైనను వాని హరణశక్తి వాని అర్ధాంగి రుద్రాణి ఆ కాళికాదేవి కళయే. ఈ త్రివిధ క్రియాత్మక స్వరూపిణి సకలయై నిర్వహించు కృత్యములివి. ఈ క్రియలు నిర్వహించిన వెనుక ఆ యా కళలు దేవిలో లీనమైయుండును. కనుక సృష్ట్యన్తప్రళయకాలాంతమునగూడ ఆమె సకలాత్మక సకలయై నిల్చియే యుండును. ఆద్యన్తరహితయైన ఆ శక్తి అనిర్వాచ్య. త్రిమూర్తులకైన అంతే. వారు ఆమె వికృతిరూపులే. వారామె తత్త్వాన్ని ప్రస్తుతించటానికి తగినంతగా ఆమె నెఱుగరు.



**శ్లో॥ అనేకే సేవన్తే భవదధికగీర్వాణనివహాన్**
**విమూఢాస్తే మాతః! కిమపి నహి జానన్తి పరమమ్ ।**
**సమారాధ్యామాద్యాం హరిహరవిరఞ్చ్యాదివిబుధైః**
**ప్రపన్నోఽస్మి స్వైరం రతిరసమహానన్దనిరతామ్ ॥ 13**

**అన్వయక్రమం :** (హే) మాతః! అనేకే విమూఢాః భవదధికగీర్వాణనివహాన్ సేవన్తే తే పరమం కిమపి న హి జానన్తి । హరిహరవిరంచ్యాదివిబుధైః సమారాధ్యామ్ ఆద్యాం రతిరసమహానందనిరతాం స్వైరం ప్రపన్నః అస్మి ॥

**ప్రతిపదార్థం :** (హే) మాతః = ఓ తల్లీ!, అనేకే = అనేకత్వమునందు, విమూఢాః = వివేకమును కోల్పడినవారు, భవద్ = నీదైన, అధిక = అమితముగా, గీర్వాణనివహాన్ = దేవతల సమూహములను, సేవన్తే = ఆరాధించుచున్నారు; హి = ఏలన, తే = నీయొక్క, కిం + అపి (కిమపి) = వర్ణింపరాని, పరమమ్ = తత్త్వమును, న జానన్తి = ఎఱుగరు, (లేక) తే = వారు, పరమమ్ = తత్త్వమును, కిమపి = యేమాత్రమును, న జానన్తి = ఎఱుగరు! (అహమ్ = నేను), హరి = విష్ణువు, హర = రుద్రుడు, విరంచి = బ్రహ్మ, ఆది = మొదలగు, విబుధైః = దేవతలచేత, సమారాధ్యామ్ = చక్కగా ఆరాధింపబడు, రతిరస = సంభోగసుఖము అను, మహానంద = గొప్ప ఆనందము నందు, నిరతామ్ = నిమగ్నమైయున్న, ఆద్యామ్ = మూలమగుదానిని, (త్వామ్ = నిన్ను), స్వైరమ్ = ఇష్టపూర్వకముగా, ప్రపన్నః = శరణుజొచ్చినవాడను, అస్మి = అగుచున్నాను.

**తాత్పర్యం :** ఓ లోకమాతా! సృష్టిలోని వారందఱును, హరిహరాది దేవతలతో సహా, నీ పరమతత్త్వము నెఱుగరు. ఆ కారణంగా మానవులు శాస్త్రోక్తదేవతలను

ఆరాధిస్తూన్నారు. కాని దేవతలు నిన్ను సర్వమూలకమాతృతత్త్వంగా యేదేని ఒక రూపంలో సేవిస్తూన్నా, నేను ఆ దేవతలవలె నిన్నే ఆద్యంతరహితమూలకారణమైన శక్తిగా భావించి రతిసుఖానందనిరతవైన రూపంలో ఇష్టదేవతగా శరణంటూన్నాను.

భక్తిలో శరణాగతి అనివార్యవైఖరి. నిజానికి స్త్రీపురుషులందఱును తెలిసిగాని, తెలియకగాని మాతృతత్త్వం నీడలోనే మనుగడ సాగిస్తూంటారు. ఒక వ్యక్తి జననంతోనే మాతృచరణాలవద్ద శరణాగతితో జీవితాన్ని ప్రారంభించటం జగమెఱిగిన సత్యం. మాతృవాత్సల్యస్పర్శతోనే జీవితంపై ఆశ చిగురిస్తుంది. ఏ బాధ కలిగినా అమ్మనే తలచి సేదదీరుతుంది జీవి. ఆ మాటలో అభయం, ఆ రూపంలో ఆత్మీయానందం అనుభవించని మానవుడుండడు; జంతువులకు, పక్షులకు సైతం కన్న తల్లియే శరణ్య దేవత. మాతృదేవో భవ, అన్న తరువాతే మిగతా యే దేవతైన. యే దేవతరూపంలోనైన నిజానికి ఉపాసించేది ఆ మాతృదేవతనే. ఇదే **యోగినీతన్త్రం** వ్యాఖ్య కూడ :

శ్లో॥ పరమానందకం రూపం జగతాం కారణం మహత్ ।
తస్యా దేవ్యాస్తు తద్రూపం ఉదయాస్తవివర్జితమ్ ॥

ఆమెయే కాలక్రియాశక్తి. అన్ని తన్త్రాలున్నూ కాళినే మహామహాబ్రహ్మావిద్యగా గుర్తించినవి.



**శ్లో॥ ధరిత్రీ కీలాలం శుచిరపి సమీరోఽపి గగనం**
**త్వమేకా కల్యాణీ గిరిశరమణీ కాలి! సకలమ్ ।**
**స్తుతిః కా తే, మాతర్నిజకరుణయా మామగతికం**
**ప్రసన్నా త్వం భూయా భవమను న భూయాన్మమ జనుః ॥ 14**

**అన్వయక్రమం :** (హే) కాలి! కల్యాణీ గిరిశరమణీ త్వమ్ ఏకా ధరిత్రీ కీలాలం శుచిః అపి సమీరః అపి గగనం సకలమ్ అసి । (హే) మాతః తే కా స్తుతిః । నిజకరుణయా అగతికం మాం (ప్రతి) త్వం ప్రసన్నా భూయాః । భవమ్ అను మమ జనుః న భూయాత్।

**ప్రతిపదార్థం :** (హే) కాలి = ఓ కాళీ!, కల్యాణీ = శుభములు గూర్చుదానవు, గిరిశరమణీ = శివుని ఇల్లాలవు, త్వమ్ = నీవు, ఏకా = ఒక్కదానవు, ధరిత్రీ = భూమి, కీలాలమ్ = నీరు, శుచిః = అగ్ని, అపి = కూడ, సమీరః అపి = వాయువు కూడ, గగనమ్ = ఆకాశము, సకలమ్ = సమస్తము, అసి = అగుదువు, (హే) మాతః = ఓ తల్లీ!, తే =

నీకు, కా = యేది, స్తుతిః = స్తుతి?, నిజకరుణయా = నీయొక్క కరుణచేత, అగతికమ్ = నిస్సహాయుడగు, మామ్ (ప్రతి) = నన్ను గూర్చి, నా దిక్కుగా, త్వమ్ = నీవు, ప్రసన్నా = ప్రసన్నురాలవు, భూయాః = అగుదువుగాక, కమ్ము, భవమ్ అను = లోకగతి ననుసరించి, మమ = నాకు, జనుః = జన్మ, న భూయాత్ = కలుగకుండుగాక!

**తాత్పర్యం :** అమ్మా కాళీ! నీవు శివుని ఇల్లాలవై శుభములు గూర్చు భూమివై, జలము నీవై, అగ్నివై, వాయువు, ఆకాశము, సమస్తము నీవొక్కదానవే అగుదువు కదా, నిన్ను వినుతించటమెట్లా సంభవం?! దిక్కుతోచని నిస్సహాయుడనగు నాయందు ప్రసన్నురాలవై, 'భవము' అను ప్రసిద్ధసూత్రముననుసరించి నాకు కలుగవలసిన జన్మము(ల) నుండి నాకు ముక్తిని ప్రసాదించుము.

శివశబ్దానికి మంగళం, శుభం, అని అర్థం. ఆ శివుని పట్టపుదేవివైన నీవు కల్యాణివనుట సహజోక్తి. అట్లే, నీ నాథుడష్టమూర్తి కనుక పృథివ్యాపస్తేజోవాయురాకాశ ములలో అంతట వ్యాప్తమైయున్న శక్తిరూపిణివి నీవే యనుట కూడ సహజోక్తియే. పంచభూతములు, పాంచభౌతిక ప్రకృతి సమస్తము తానైన తల్లిని కీర్తించటం సాధ్యమా! అన్నీ తానైన తల్లిని అందు యే కొన్నియో నీవనుట కీర్తించుట కాదు కదా!? నిన్ను వర్ణింపబూనుట నిన్ను తగ్గించి పలుకుటే యగునుగాని నిన్ను హెచ్చించి పలుకుట కాదుకదా! అందుచే నిన్ను నుతించుటకు నే నసహాయుడను, అశక్తుడను. కనుక కరుణించి, నీవే యేర్పఱచిన 'భవము' (పుట్టుట) అను ఈ విశ్వసూత్రము నా కన్వయించ కుండునట్లు ప్రసన్నురాలవు కమ్మని ఈ అభ్యర్థన.

పంచభూతములుగా చెప్పబడునవి అన్ని మతములు, సంప్రదాయములు, భౌతిక విజ్ఞాన శాస్త్రము కూడ ప్రస్తావించు తత్త్వములలో కొన్ని. ఈ తత్త్వముల సంఖ్య వివిధ మతానుసారిగా, ఆగమమున 3, శ్రౌతమున 24 (లేక 25), పాతంజలమున 26, పాశుపతమున 31, శాక్తేయమున 36, శైవమున 51, ఇట్లు మతాంతరములందు 96 వరకు లెక్కగట్టబడినవి. తత్త్వము అనగా 'ప్రలయపర్యంతస్థాయివస్తూని' అనియు, **'ఆప్రలయం యస్తిష్ఠతి సర్వేషాం భోగదాయి భూతానాం తత్త్వమితి ప్రోక్తమ్'** అనియును చెప్పబడినది. కాళి కాలశక్తి కనుక ఆమె 'సకలం' అనబడినది.



## 5. పురశ్చరణ ప్రకరణము

**పురశ్చరణం** అన్న పదానికి, ప్రారంభక క్రియాకలాపం అనిన్నీ, హవనంతో కూడిన దేవతానామజపమనిన్నీ, అర్థాలు కోశంలో కనిపిస్తాయి. ఈ ప్రక్రియ మంత్రోద్ధార, ధ్యాన, సాధన, స్తుతి క్రియల తరువాత చేయవలసినది. పురశ్చరణ లేని సాధన ఫలించదనిన్నీ, కలియుగంలో ఈ పురశ్చరణం నాలుగుమార్లు చేయవలెననిన్నీ నిర్ధారణ చేయబడింది. ఇది నిష్కామమైనదైతే మహామహిమాన్వితం. సకామమైతే సాధకుడు తానే చేసికొనవచ్చును, లేదా బ్రాహ్మణముఖంగా జరిపించవచ్చు. మొదటి విధానం శ్రేయస్కరం. శ్రీ దక్షిణకాళికా పురశ్చరణం వలన మారణ, మోహన, వశీకరణ, ఉచ్చాటన, స్తంభన, శాన్తి, పుష్టి ఆది సిద్ధులు సంపాదించవచ్చు, అని కలాతన్త్రం వివరిస్తుంది. పురశ్చరణసాధనకు యోగ్యమైన స్థలాలు శ్మశానము, యోని అని నిర్దేశింపబడినవి. ఈ రెండున్నూ సృష్టిలయాలకు ప్రతీకలుగా చెప్పబడినవి. ఈ రెండు కాళీమాత స్వరూపాలు. ధర్మశాస్త్రం ఇట్లా ప్రవచించింది :

శ్లో॥ మైథునాన్తే శ్మశానాన్తే భోజనాన్తే చ యా మతిః ।
సా మతిః సర్వదా తిష్ఠేత్ కో న ముచ్యేత బంధనాత్ ॥

మైథునసుఖానుభవం తర్వాత, మరణదృశ్యానుభవం తర్వాత, భోజనం తర్వాత కలిగే సుఖ, వైరాగ్య, తృప్తి భావనలు మనసులో నిల్చి ఉండగలవు. ఆ భావనలతో బంధవిముక్తి అనుబంధం ఎవరికైన కలిగితీరుతుంది.

కర్పూరస్తవంలో ఐదువిధాల సాధన చెప్పబడింది : శ్మశానసాధనలు, యోని సమర్చనం, యంత్రసమర్చనం, బలిప్రదానం, లతా సాధన.

**శ్లో॥ శ్మశానస్థః స్వస్థో గలితచికురో దిక్పటధరః**
**సహస్రం త్వర్కాణాం నిజగలితవీర్యేణ కుసుమమ్ ।**
**జపంస్త్వత్ప్రత్యేకం మనుమపి తవ ధ్యాననిరతో**
**మహాకాలి! స్వైరం స భవతి ధరిత్రీపరివృఢః ॥ 15**

**అన్వయక్రమం :** (హే) మహాకాలి! శ్మశానస్థః స్వస్థః గలితచికురః దిక్పటధరః తవ ధ్యాననిరతః (సాధకః) నిజగలితవీర్యేణ అర్కాణాం సహస్రం కుసుమం తత్ ప్రత్యేకం తు మనుం స్వైరం జపన్, సః ధరిత్రీపరివృఢః భవతి ॥

**ప్రతిపదార్థం :** (హే) మహాకాలి = ఓ మహాకాలీ!, శ్మశానస్థః = శ్మశానములో

ఉన్నవాడై, స్వస్థః = స్వస్థచిత్తుడై, గలితచికురః = జుత్తువిరబోసికొన్నవాడై, దిక్పటధరః = దిగంబరుడై, తవ = నీయొక్క ధ్యాననిరతః = ధ్యానమున నిమగ్నుడైయున్న, సాధకః = సాధకుడు, నిజ = తనయొక్క, గలిత = స్ఖలనమైన, వీర్యేణ = వీర్యముతో, అర్కాణాం కుసుమమ్ = జిల్లేడు పువ్వుల, సహస్రమ్ = వెయ్యింటితో, తత్ = ఆ, ప్రత్యేకం తు మనుమ్ = ప్రత్యేకమైన మంత్రమును, స్వైరమ్ = ఇష్టపూర్వకముగ, జపన్ = జపించుచు, సః = ఆతడు, ధరిత్రీపరివృఢః = భూమీపాలకుడు, భవతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** ఓ మహాకాళీ! శ్మశానములోనుండి, శాంతుడై, జుత్తువిరబోసికొని, దిగంబరుడై, నిన్ను ఏకాగ్రముగ ధ్యానించుచున్న సాధకుడు తన వీర్యముతో తడుపబడిన వెయ్యి జిల్లేడు పువ్వులతో, ఇష్టపూర్వకముగ నీ ప్రత్యేకమంత్రమును జపించినచో, ఆతడు రాజు కాగలడు.

ఈ ప్రకరణం మొదట పురశ్చరణ వివరణలో ప్రస్తావించిన పంచవవిధ సాధనలలో ఈ శ్లోకం శ్మశాన సాధనావిధానాల్లో ఒకదానిని పొందుపఱచింది. కాళీదేవికి దీక్షితోపనిషత్తు అష్టవిధరూపాలను చెప్పింది : **1. చిన్తామణి కాళీ, 2. స్పర్శమణి కాళీ, 3. సన్తతిప్రదా కాళీ, 4. సిద్ధి కాళీ, 5. దక్షిణా కాళీ, 6. కామకళా కాళీ, 7. హంస కాళీ, 8. గుహ్య కాళీ.** వీనిలో దక్షిణాకాళీ ప్రస్తుతరూపం, ఆరాధ్యదేవత. శక్తి సాధకుడెంచికొన్న సాధనాస్థలం, శ్మశానం. ఐనప్పటికి, ఆతడు స్వస్థుడు, అనగా ఆ పరిసరాల ప్రభావానికి లోనుగాక తాను తానుగా నిర్వికారుడై, శాంతుడై, చెదరని ఏకాగ్రత గలవాడు. తాను స్వయంగా విరబోసిన జుత్తుతో, దిగంబరుడై, శ్మశానపు ఆవరణంలో కలిసిపోయినవాడు. వాని పూజావిధి : తన వీర్యంతో తడిపిన అర్కపుష్ప సహస్రార్చన, ధ్యానమున మహాకాళి రూపం, జపమున ద్వావింశత్యక్షరీ విద్యారాజ్ఞీ మంత్రమైన **"క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణేకాలికే క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం  స్వాహా"** అనునది. ఈ మంత్రము నొక ఆవృత్తి జపించి స్వవీర్యప్లుత అర్కపుష్పము నొకదానిని సమర్పించుట. ఇట్టివి సహస్రం. ఈ విధానం మహాకాలసంహితలోను, మంత్రమహోదధిలోను, కాళీతన్త్రంలోను చెప్పబడినది. ఈ పూజకు సమయం రాత్రి. ఇది ఈ ఆరాధనకు బాహ్యాచారరూపం. దీని అంతరార్థం ముందటి శ్లోక వ్యాఖ్యలలోనే చేయబడినది. ఇక్కడి సాధకుడు మాయావరణరహితుడై స్థిరచిత్తుడై ఆత్మారామభావంతో, లేక, బ్రహ్మపరాయణత్వంతో తన సచ్చిదానంద స్వరూపధ్యానం చేస్తూన్నవాడు. సహస్రారంనుండి స్రవించే అమృతధారతో ఆ తల్లికి

పాద్యమిచ్చి, మనస్సునే అర్ఘ్యం చేసి, చిత్తాన్ని పుష్పంగా సమర్పించి, ప్రాణాలను ధూపంగా మలచి, భక్తి దీపాన్ని హారతి పడతాడు. **ఈతడు దివ్యభావసాధకుడు.** ఈ సాధనలో వాని సాఫల్యం సహజావస్థ, ఆత్మజ్ఞానం.



**శ్లో॥ గృహే సంమార్జన్యా పరిగలితవీర్యం హి చికురం**
**సమూలం మధ్యాహ్నే వితరతి చితాయాం కుజదినే ।**
**సముచ్చార్య ప్రేమ్ణా మనుమపి సకృత్కాలి! సతతం**
**గజారూఢో యాతి క్షితిపరివృఢః సత్కవివరః ॥ 16**

**అన్వయక్రమం :** (హే) కాలి! (యః) గృహే సమ్మార్జన్యా పరిగలితవీర్యం సమూలం చికురం కుజదినే మధ్యాహ్నే ప్రేమ్ణా మనుమపి సకృత్ సముచ్చార్య చితాయాం వితరతి (సః) సత్కవివరః క్షితిపరివృఢః (సన్) సతతం గజారూఢః యాతి ॥

**ప్రతిపదార్థం :** (హే) కాలి = ఓ కాళీ!, (యః = ఎవడు), గృహే = ఇంటియందు, సమ్మార్జన్యా = చీపురుతో, సమూలమ్ = మొదలంట, పరిగలితవీర్యమ్ = వీర్యముతో తడుపబడిన, చికురమ్ = జుత్తును, కుజదినే = మంగళవారమున, మధ్యాహ్నే = మధ్యాహ్నమున, ప్రేమ్ణా = ప్రేమతో, మనుం అపి = మంత్రమును కూడ, సకృత్ = ఒకేసారి, సముచ్చార్య = చదివి, చితాయామ్ = అగ్నియందు, వితరతి = ఆహుతి చేయునో, (సః = వాడు), సత్కవివరః = సత్కవియైన, క్షితిపరివృఢః (సన్) = రాజు అగును, సతతమ్ = ఎప్పుడూ, గజారూఢః = ఏనుగునెక్కి, యాతి = సంచరించును.

**తాత్పర్యం :** ఏ సాధకుడు మంగళవారము మధ్యాహ్న సమయమున ఇంటిలో ఉన్న చీపురుతో ఊడబెరుకబడిన జుత్తును మొదలంట వీర్యముచే తడిపి అగ్నిలో, ద్వావింశత్యక్షరీ విద్యారాజ్ఞీమంత్రమును ఉచ్చరించుచు ప్రేమతో ఆహుతి చేయునో, ఆతడు కవిరాజై, రాజై, ఎల్లకాలము ఏనుగునెక్కి సంచరించును.

ఈ శ్లోకంలో నానావిధార్థబోధకపదాలు : గృహే, సమ్మార్జన్యా, పరిగలితవీర్యం. ఈ శబ్దాలకు రూఢ్యర్థాలే కాక సందర్భాశ్రితవిశేషార్థాలున్నూ చెప్పవచ్చును. గృహే = ఇంటిలో, సామాన్యార్థం. కాని, **యోనిలో** అన్న విశేషార్థాన్ని గాని, ఇల్లాలియందు అని గాన చెప్పవచ్చు. అట్లే, సమ్మార్జన్యా = దువ్వెనతో, చీపురుతో, దాసితో, **పురుషాంగముతో** అని చెప్పవచ్చు. పరిగలితవీర్యమ్ = స్వస్థానస్థితశక్తి గలవాడు, వీర్యముతో కలిసినది,

సంభోగములో **స్ఖలనమైన వీర్యము,** ఇట్లు విగ్రహార్థములు చెప్పవచ్చు. ఈ శ్లోకానికి దివ్యసాధకమార్గంలో అర్థం చెప్పటం సమంజసం : మంగళవారం మధ్యాహ్న సమయంలో సహస్రారంలోని పరమశివుని గూడి కులకుండలినీ సంయోగంలో జారిన అమృతాహుతి. దీనికి ఉపకరణాలు మనసున, వాసనలతో (సంస్కారాలతో) సహా అహంకారము, అసత్యము, పిశునత్వము, ఇత్యాది. మూలాధారంలోని వాసనాదాహక మైన చితారూపిణి కాలియందు సంస్కారాలన్నిటినీ ఆహుతి చెయ్యటం, తద్ద్వారా నిర్బీజసమాధిని సాధించటం, ఈ పద్యార్థంగా దివ్యభావం బోధిస్తుంది.



**శ్లో॥ స్వపుష్పైరాకీర్ణం కుసుమధనుషో మన్దిరమహో**
**పురో ధ్యాయన్ ధ్యాయన్యది జపతి భక్తస్తవ మనుమ్ ।**
**స గన్ధర్వశ్రేణీపతిరపి కవిత్వామృతనదీ -**
**నదీనః పర్యన్తే పరమపదలీనః ప్రభవతి ॥ 17**

**అన్వయక్రమం :** యది స్వపుష్పైః ఆకీర్ణం కుసుమధనుషః మన్దిరం పురః ధ్యాయన్ ధ్యాయన్ భక్తః తవ మనుం జపతి,అహో! సః గంధర్వశ్రేణీపతిః అపి కవిత్వామృత నదీనదీనః పర్యన్తే పరమపదలీనః ప్రభవతి ॥

**ప్రతిపదార్థం :** యది = ఒకవేళ, స్వపుష్పైః = తనవైన పూవులతో, ఆకీర్ణమ్ = వెదజల్లబడిన, కుసుమధనుషః = మన్మథునియొక్క, మన్దిరమ్ = మందిరమును, పురః = ఎదురుగా, ధ్యాయన్ = ధ్యానించుచు, ధ్యాయన్ = ధ్యానించుచు, భక్తః = భక్తుడు, తవ మనుమ్ = నీ మంత్రమును, జపతి = జపించుచున్నాడో, అహో = ఔరా!, సః = ఆతడు, గంధర్వశ్రేణీపతిః అపి = గంధర్వులరాజైనను, కవిత్వామృత = కవిత్వము అను అమృతముయొక్క, నదీనదీనః = నదుల సముద్రము, పర్యన్తే = కడపట, పరమపదలీనః = ముక్తిగలవాడు, ప్రభవతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** ఏ భక్తుడైనను, ఓ తల్లీ!, తన పూవులతో వెదజల్లబడిన మన్మథుని మందరమును తన ఎదుట భావించి ధ్యానించి, నీ మంత్రమును జపము చేసినచో, ఔరా!, ఆతడు గంధర్వరాజైనను, కవితాసముద్రుడై కడపట ముక్తుడగును.

ఈ తాత్పర్యం ఈ శ్లోకంలోని శబ్దాలకు సాధారణార్థంతో సాధించదగినది. సందర్భోచితంగా, శైవశాక్తేయ సంప్రదాయ మార్మికార్థం వేరు. పూర్వశ్లోకంలో

శ్మశానసాధన చెప్పి, ఈ శ్లోకంలో **యోనిసాధన** గూర్చి చెప్పబూనినాడు కవి. ఇట్లా ఎందుకంటే, జీవుడు యోనినుండి జన్మించి, శ్మశానం నుండి నిష్క్రమించి, మరల యోనినుండి జనిస్తూంటాడు. కనుక ఈ విషయాన్ని మరువక మదినుంచుకోవాలి సాధకుడు. ఇక్కడ పూజింపబడేది సమస్త విశ్వానికే యోనిత్వం వహించే జగన్మాత. దీనికి ప్రతీకగా సాధకుడు స్వస్త్రీని గాని పరకీయనుగాని భగవతిగా భావించి ధ్యానం చేస్తాడు. కనుక ఈ శ్లోకంలోని పుష్పశబ్దం పువ్వును కాక స్త్రీని బోధిస్తుంది. శాక్తేయులు ఈ అర్థంలో పుష్పాన్ని రెండు విధాలుగా భావిస్తారు. **కులచూడామణి – పుష్పహీనా పశోః శక్తిః వీరస్య పుష్పసంయుతా,** అంటే, రజస్సులేని శుద్ధమైనది, రజస్సుతోకూడి మలినమైనది, అను ఈ రెండిటిలో మొదటిదానితో దక్షిణాచారవంతులున్నూ, రెండవ దానితో **వీరాచారవంతులున్నూ** ఉపాసన చేస్తారు. ఈ పద్ధతిలో పుష్పాలు ఎనిమిది విధాలు : **1) స్వపుష్పం, 2) వీరపుష్పం, 3) స్వయంభూ పుష్పం, 4) వజ్రపుష్పం, 5) గోపీచందనపుష్పం, 6) కుండోద్భవపుష్పం, 7) గోలకపుష్పం, 8) సర్వకాలోద్భవపుష్పం. వీని నిర్వచనాలిట్లా!**

శ్లో॥ వివాహితాయాః కన్యాయాః ప్రథమే ఋతుసంగమే ।
తత్ శోణితం మహేశాన **స్వపుష్పం** పరికీర్తితమ్ ॥ 1

శ్లో॥ స్వస్త్రీషు మైథునే దేవ యత్పుష్పం సముపస్థితమ్ ।
తత్పుష్పం **వీరపుష్పం** చ స్వయంభూకుసుమం శృణు ॥ 2

శ్లో॥ అవివాహితాయాః కన్యాయాః లింగస్పర్శాద్రజస్వలా ।
తద్ద్రవ్యం చ మహాదేవ **స్వయంభూకుసుమం** ప్రభో ॥ 3

శ్లో॥ వివాహితాయాః కన్యాయాః పురుషస్య చ తాడనాత్ ।
యది పుష్పం సముద్భూతం ***వజ్రం*** తత్పరికల్పితమ్ ॥ 4

శ్లో॥ పురుషే మైథునే యుక్తే యద్రక్తం శుక్రమిశ్రితమ్ ।
క్షరతే చ భగాద్రక్తం తద్ద్రవ్యం ***గోపీచందనమ్*** ॥ 5

శ్లో॥ భర్తృయుక్తా చ యా నారీ పురుషాన్యస్య యోగతః
రక్తం సముద్ధరేద్యోన్యా అథవా గర్భసంకటాత్ ।
**కుండోద్భవం** తద్విజ్ఞేయం శృణు గోలోద్భవం ప్రియ ॥ 6

శ్లో॥ స్వామిశూన్యా చ యా నారీ జారయోగాద్రజస్వలా ।
తద్రక్తం **గోలకం** జ్ఞేయం సర్వకాలోద్భవం శృణు ॥ 7

శ్లో॥ మాసి మాసి చ యద్రక్తం క్షరతే యోనిమండలాత్ ।
తద్రక్తం పరమేశాన **సర్వకాలోద్భవం** ప్రియ ॥ 8

**ఘోరకౌలులు** దీనిని విభిన్నంగా, 1) ఆలింగన, 2) చుంబన, 3) స్తనమర్దన, 4) దర్శన, 5) స్పర్శన, 6) వికాశన, 7) ఘర్షణ, 8) ప్రవేశన, 9) శక్తిస్థాపన, అను తొమ్మిది పుష్పాలను చెబుతారు. **దక్షిణాచారులు** పూర్తిగా వేరైన నవపుష్పాలను చెబుతారు : కుంభ, శంఖ, శ్రీ, శక్తి, గురు, ముక్తి, యోగినీ, భైరవ, బలిపాత్ర. **దివ్యాచారులు** వేరేవిధంగా దశపుష్పాలను ఇట్లా చెబుతారు : దయా, జ్ఞాన, క్షమా, ఇంద్రియనిగ్రహ, జ్ఞాన (విద్యా), దాన, పుణ్య, అహింసా, ఆనంద, సాధన, అర్చన. వీనిలో జ్ఞానదానాలు కలిపి ఒకటిగా చెప్పటం కద్దు. అప్పుడు సాధన ఆ స్థానంలో వస్తుంది. మరొకవిధంగా ఇట్లా గూడా : అనహంకార, అమద, అరాగ, అమోహ, అద్వేష, అదంభ, అమాయ, అమాత్సర్య, అక్షోభ్య, అలోభ.

ఈశ్లోకంలో, కుసుమధనుషః మందిరం అనగా యోని అనిన్నీ, స్వపుష్పైరాకీర్ణం అనగా, వివాహితయైన కన్యకు మొదటి నెలసరి రక్తస్రావంతో తడిసిన యోని, అని అన్వయించవలసి ఉంటుంది. అట్టి యోనిని ధ్యానించి ద్వావింశత్యక్షరీ విద్యారాజ్ఞీ మంత్రాన్ని జపించటం వలన కవితాసిద్ధి లభిస్తుంది, అని తాత్పర్యం అవుతుంది. ఈ విధమైన ఉపాసన, పురశ్చరణ పద్ధతిని అనుసరించినవారు జపానంతరం యోనిస్తోత్రం ఈ క్రింది విధంగా తప్పక చెయ్యాలి :

## యోనిస్తోత్రమ్

శ్లో॥ భగరూపా జగన్మాతా సృష్టిస్థితిలయాన్వితా ।
దశవిద్యాస్వరూపాత్మా యోనిర్మాం పాతు సర్వదా ॥ 1

శ్లో॥ కోణత్రయయుతా దేవి స్తుతినిందావివర్జితా ।
జగదానందసంభూతా యోనిర్మాం పాతు సర్వదా ॥ 2

శ్లో॥ రక్తరూపా జగన్మాతా యోనిమధ్యే సదా స్థితా ।
బ్రహ్మవిష్ణుశివప్రాణా యోనిర్మాం పాతు సర్వదా ॥ 3

శ్లో॥ కార్తికీకున్తలం రూపం యోన్యుపరి సుశోభితమ్ ।
భుక్తిముక్తిప్రదా యోనిః యోనిర్మాం పాతు సర్వదా ॥ 4

శ్లో॥ వీర్యరూపా శైలపుత్రీ మధ్యస్థానే విరాజితా ।
బ్రహ్మవిష్ణుశివశ్రేష్ఠా యోనిర్మాం పాతు సర్వదా ॥ 5

శ్లో॥ యోనిమధ్యే మహాకాలీ ఛిద్రరూపా సుశోభనా ।
సుఖదా మదనాగారా యోనిర్మాం పాతు సర్వదా ॥ 6

శ్లో॥ కాల్యాదియోగినీ దేవీ యోనికోణేషు సంస్థితా ।
మనోహరా దుఃఖలయా యోనిర్మాం పాతు సర్వదా ॥ 7

శ్లో॥ సదాశివో మేరురూపో యోనిమధ్యే వసేత్సదా ।
కైవల్యదా కామయుక్తా యోనిర్మాం పాతు సర్వదా ॥ 8

శ్లో॥ సర్వదేవస్తుతా యోనిః సర్వదేవప్రపూజితా ।
సర్వప్రసవకర్త్రీ త్వం యోనిర్మాం పాతు సర్వదా ॥ 9

శ్లో॥ సర్వతీర్థమయీ యోనిః సర్వపాపప్రణాశినీ ।
సర్వగేహే స్థితా యోనిః యోనిర్మాం పాతు సర్వదా ॥ 10

శ్లో॥ ముక్తిదా ధనదా దేవి సుఖదా కీర్తిదా తథా ।
ఆరోగ్యదా వీరరతా పంచతత్త్వయుతా సదా ॥ 11

శ్లో॥ యోనిస్తోత్రమిదం ప్రోక్తం యః పఠేద్యోనిసన్నిధౌ ।
శక్తిరూపా మహాదేవీ తస్య గేహే సదా స్థితా ॥ 12

మంత్రార్థాన్నీ, మంత్రచైతన్యాన్నీ, యోనిముద్రాపరిజ్ఞానాన్నీ కలిగియుంటే, సిద్ధి లభిస్తుంది. జపం మాత్రం చేస్తే చాలదు.

దివ్యసాధకుడు స్వయంభూలింగాధిష్ఠితమూలాధారం లేక హృదయపద్మం పైనుండి త్రికోణాత్మకయోనిని ధ్యానిస్తూ ద్వావింశత్యక్షరీవిద్యారాజ్ఞీమంత్రజపం మానసికంగా చేయవలసియున్నది.



శ్లో॥ త్రిపఞ్చారే పీఠే శవశివహృది స్మేరవదనాం
మహాకాలేనోచ్చైర్మదనరసలావణ్యనిరతామ్ ।
సమాసక్తో నక్తం స్వయమపి రతానన్దనిరతో
జనో యో ధ్యాయేత్త్వామయి జనని! స స్యాత్ స్మరహరః ॥ 18

**అన్వయక్రమం :** అయి జనని! నక్తం స్వయమ్ అపి రతానందనిరతః (త్వయి) సమాసక్తః యః త్రిపంచారే పీఠే శవశివహృది మహాకాలేన ఉచ్చైః మదనరసలావణ్యనిరతాం స్మేరవదనాం త్వాం ధ్యాయేత్, సః స్మరహరః స్యాత్ ॥

**ప్రతిపదార్థం :** అయి జనని = ఓ తల్లీ!, నక్తమ్ = రాత్రివేళ, స్వయమ్ అపి = తనకు తానే, రతానందనిరతః = సంభోగానందమగ్నుడై, (త్వయి = నీయందు), సమాసక్తః = గాఢమగు ఆసక్తిగల, యః = ఎవడైనను, త్రిపఞ్చారే పీఠే = త్రిపంచారపీఠమున, శవశివహృది = శవరూపమునగల శివుని హృదయముపై, మహాకాలేన = మహాకాలునితో, ఉచ్చైః = అధికాధికముగ, మదనరసలావణ్యనిరతామ్ = శృంగార సుఖానుభవమువలన దీప్తమైన సౌందర్యవతిని, స్మేరవదనామ్ = నగుమోముగలదానిని, త్వామ్ = నిన్ను, ధ్యాయేత్ = ధ్యానము చేయునట్టి, సః = ఆతడు, స్మరహరః = మదనాంతకుడు, స్యాత్ = అగును.

**తాత్పర్యం :** ఓ తల్లీ! ఏ సాధకుడైనను రాత్రివేళ స్వయముగా సంభోగసుఖమునందుండి, నీయందు మనస్సును లగ్నముచేసి, త్రిపంచారపీఠమున శవరూపశివుని హృదయముపై మహాకాలునితో అధికమైన శృంగారసుఖానుభవసందీప్తసౌందర్యముతో నవ్వుచున్న నిన్ను ధ్యానించగలిగినచో, అట్టివాడు సాక్షాత్ కాముని దహించిన శివస్వరూపుడే యగును.

ఈ శ్లోకంలో వర్ణింపబడిన కాళియున్నది శవశివహృది, అనగా శవమైన శివుని హృదయంలో. దివ్యాచారుల భావనలో, శివుడు నిర్గుణుడై నిష్క్రియుడైనప్పుడు శవస్థితిని పొందుతాడు, వాని హృదయంలో, కల్పాదియందు ఇచ్ఛాజ్ఞానక్రియారూపిణి యైన దక్షిణకాళిక సూక్ష్మరూపంలో ఉండి, మహాకాలునితో, అనగా సగుణబ్రహ్మరూప శివునితో విపరీతరతిలో ఉంటుంది. సాధకుడు స్వయంగా యోనిముద్రావలంబియై శక్తిమయుడై పరమాత్మునిలో లయమనబడు రతిలో ఆనందానుభవం పొందుతూంటాడు. ఈ అనుభవం ఈ దేహమనే యంత్రంలో ఆ కాళీరూపజ్ఞానం వలన ఛాయామాత్రంగా, జ్ఞేయజ్ఞాతల ఐక్యతారూపంలో కలుగుతుంది. ఈ దేహయంత్రభావనలో, పంచతత్త్వాలతో నిర్మితమైన భూమి, అందు గుహ్యభాగంలో అవిద్యావృత్తంలో అష్టదళవృత్తం.

పృథివ్యాపస్తేజోవాయురాకాశాలైదున్నూ దాని కర్ణికలు, వానితో మనోబుద్ధ్యహంకారాలు చేరినవి. ఈ ఎన్మిది భగవద్గీతలో చెప్పబడిన పరమాత్ముని అష్టవిధ ప్రకృతి. ఈ వృత్తం లోపల పంచత్రికోణాలలో, అనగా 15 కోణాలతో (జ్ఞానకర్మేంద్రియదశకమున్నూ పంచభూతాలున్నూ) ఇదే త్రిపంచార (3 × 5 = 15) పీఠంపై భగవతిని దర్శించిన సాధకుడు కామదాహకుడైన శివుడే తానవుతాడు.

త్రికోణపు మూడు భుజాలున్నూ వామ, దక్షిణ, దివ్యభావాలు మూడిటితో ఉపాసించు సాధకులనియు, ఇట్టి త్రికోణపంచకము పంచవిధ సాధనలకు (శ్మశాన, యోని, యంత్ర, బలి, లతా సాధనలు) ప్రతీకలనిగూడ చెప్పవచ్చు. ఈ సాధనకు సమయం నక్తం (రాత్రి) యని చెప్పబడినది.

ఈ పీఠమని చెప్పబడిన యంత్రస్వరూపమిట్లాగని **దేవీరహస్యము,** కాలీరహస్యము, కాలీతన్త్రము, కుమారీతన్త్రము, సిద్ధేశ్వరతన్త్రము, మన్త్రమహోదధి, అను గ్రంథాలు నిర్దేశిస్తున్నాయి : ఈ యంత్రం మధ్యస్థానం లేక కేంద్రబిందువు క్రీం, హూం, హ్రీం అను బీజాలతో కూడినది. దీనిపై అధోముఖంగా సమభుజత్రికోణాలు ఐదుంటాయి. దీనిని చుట్టుకొని ఒక అష్టదళవృత్తం, అటుపై దాని చుట్టును మూడు వృత్తాలు, వీనికి నాలుగు దిక్కులలో నాలుగు చతురస్ర ద్వారాలు, ఒక భూపురమండలం వ్రాయవలె.



శ్లో॥ సలోమాస్థి స్వైరం పలలమపి మార్జారమసితే!
పరం వౌష్ట్రం మైషం నరమహిషయోశ్ఛాగమపి వా ।
బలిం తే పూజాయామపి వితరతాం మర్త్యవసతాం
సతాం సిద్ధిః సర్వా ప్రతిపదమపూర్వా ప్రభవతి ॥ **19**

**అన్వయక్రమం :** (హే) అసితే! తే పూజాయాం మార్జారం వా ఔష్ట్రం వా మైషం వా నరమహిషయోః వా ఛాగమ్ అపి వా సలోమాస్థి పరం పలలం బలిం స్వైరం వితరతాం మర్త్యవసతాం సతాం ప్రతిపదమ్ అపూర్వా సర్వా సిద్ధిః ప్రభవతి ॥

**ప్రతిపదార్థం :** (హే) అసితే = ఓ నల్లని తల్లీ!, ఓ బంధరహితా!, తే = నీయొక్క, పూజాయామ్ = పూజయందు, మార్జారమ్ = పిల్లికి సంబంధించినది, వా = లేక, ఔష్ట్రమ్ = ఒంటెకు సంబంధించినది, వా = లేక, మైషమ్ = ఎలుకకు సంబంధించినది, వా = లేక, నర = మనుష్యునిది, మహిషయోః = దున్నపోతుది, ఈ ఇద్దరికి సంబంధించినదియైనను, ఛాగం అపి వా = మేకకు సంబంధించినదైనను, సలోమ + అస్థి = రోమము, ఎముకతో కూడినదైన, పలలమ్ = మాంసమును, బలిమ్ = బలిగా, నివేదనగా, వితరతామ్ = తర్పణము చేయునట్టి, మర్త్యవసతామ్ = మానవులైన, సతామ్ = సద్బుద్ధి, సదాచారముగలవారికి, ప్రతిపదమ్ = అడుగడుగున, అన్ని విషయములలో, అపూర్వా = అపూర్వమైన, పరమ్ = మిక్కిలి, సిద్ధిః = సిద్ధి, సర్వా = సమస్తము, ప్రభవతి = లభించును.

**తాత్పర్యం :** అమ్మా, కృష్ణకాళీ! బంధరహితురాలవైన నీ పూజయందు భాగముగా యే సాధకుడైనను, తన నైమిత్తిక పూజలో నైవేద్యముగా పిల్లి, ఒంటె, ఎలుక, మేక, దున్న, మనిషి, వీనిలో ఎవరికైన చెందిన రోమములతో ఎముక, మాంసమును సమర్పించినచో, వానికి అన్ని విషయములలో మిక్కిలి అపూర్వమైన సిద్ధి లభిస్తుంది.

గత శ్లోకంలో యంత్రం గురించి చెప్పిన తర్వాత బలిని గురించి ఈ శ్లోకంలో చర్చ. జంతుబలినుండి నరబలివరకు చెప్పబడింది. తాంత్రిక సాహిత్యంలో ఈ బలివిధి ఈ విధంగా చెప్పబడింది వర్ణవ్యవస్థను బట్టి నిర్ణయంగా :

శ్లో॥ బ్రాహ్మణో నియతః శుద్ధః సాత్త్వికం బలిమాచరేత్ ।
విప్రాణాం క్షీరబలయః శాల్యన్నం వాథ పాయసమ్ ।
ఘృతలుప్తం చర్వ్యఫలం పుష్పం తస్య ఘృతాన్వితమ్ ।

దద్యాత్ క్షీరం చ దుగ్ధాన్నం భక్తాన్నం వా నివేదయేత్ ।
శాల్యన్నం వాథ సమధు కృషరం ఖండమోదకమ్ ॥

శ్లో॥ రాజ్ఞాం హి పశవః శస్తా వైశ్యానాం వ్రీహయస్తథా ।
క్షౌద్రం వృషలజాతీనాం సర్వేషాం పశవోఽథవా ॥

**– పరశురామ కల్పసూత్రం**

జన్మవర్ణం కాక గుణవర్ణాన్నిబట్టి నైవేద్యనిర్ణయం (బలివిధి) చేయటం సహేతుకం. అట్లే బ్రహ్మచర్యాది ఆశ్రమవ్యవస్థనుబట్టీను. అహింసాత్మకంగా ఆ యా పశువుల కల్పన చేసి చేయవచ్చు.

పశుబలి స్థానంలో వివిధ ఫలాలుకూడ చెప్పబడినవి.

శ్లో॥ కుష్మాణ్డ–పనసాఽలాబు–కర్కటీ–బిల్వ–దాడిమాః ।
ద్రాక్షా–ఖర్జూర–లకుచ–రసాలా–ఽమలా–జమ్బుకమ్ ।
బలితుల్యాని చైతాని ఛాగతుల్యాని తృప్తిషు ।

దివ్యాచారపరంగా ఆ యా జంతువులను కామక్రోధాదివికారాలకు ప్రతీకలుగా అన్వయించటమూ కద్దు : **కామక్రోధౌ ఛాగవాహౌ బలిం దత్వా ప్రపూజయేత్,** అన్న **అన్నదాకల్ప** వాక్యాన్నిబట్టి మిగత జంతువుల గుణాలను ఆ యా వికారాలుగా గ్రహించవచ్చు.



**శ్లో॥ వశీ లక్షం మన్త్రం ప్రజపతి హవిష్యాశనరతో**
**దివా మాతర్యుష్మచ్చరణకమలధ్యాననిరతః ।**
**పరం నక్తం నగ్నో నిధువనవినోదేన చ మనుం**
**జపేల్లక్షం స స్యాత్ స్మరహరసమానః క్షితితలే ॥** **20**

**అన్వయక్రమం :** (హే) మాతః (యః) వశీ దివా హవిష్యాశనరతః యుష్మత్ చరణకమలధ్యాననిరతః లక్షం మన్త్రం ప్రజపతి చ నక్తం నగ్నః నిధువనవినోదేన పరం లక్షం జపేత్, సః క్షితితలే స్మరహరసమానః స్యాత్ ॥

**ప్రతిపదార్థం :** మాతః = ఓ తల్లీ, (యః) వశీ = ఏ జితేంద్రియుడు, దివా = పగటివేళ, హవిష్యాశన = హవిస్సులే ఆహారముగా, రతః = ఆనందించువాడై, యుష్మత్ = నీయొక్క, చరణకమల = పద్మములవంటి పాదములను, ధ్యాన = ధ్యానించుటలో,

నిరతః = లగ్నమనస్కుడై, లక్షం మన్త్రమ్ = దక్షిణకాళికా విద్యారాజ్ఞీమంత్రమును లక్షపర్యాయములు, ప్రజపతి = జపించుచున్నాడో, చ = మరియు, నక్తమ్ = రాత్రివేళ, నగ్నః = దిగంబరుడై, నిధువన వినోదేన = సంభోగానందముతో, పరమ్ = మరియొక, లక్షమ్ = లక్షను, జపేత్ = జపించునో, సః = ఆతడు, క్షితితలే = లోకంలో, స్మరహరసమానః = శివునితో సమానుడు, స్యాత్ = అగును.

**తాత్పర్యం :** ఎవడైన జితేంద్రియుడొకడు పగటివేళ హవిర్భోక్తగానుండి నీ పాదములపై మనసునుంచి ధ్యానించుచు, నీ మంత్రమును లక్షసార్లు జపించి, రాత్రివేళ దిగంబరుడై సంభోగముననుండి మరియొక లక్షసార్లు జపించినచో, ఆతడు శివసముడగును.

పగలు, రాత్రి కలిపి రెండు లక్షలసార్లు ద్వావింశత్యక్షరీ విద్యారాజ్ఞీ మహామంత్రాన్ని జపించవలెనని అర్థం కదా, ఇది స్వయంగా చేయవలసినది కూడ. దీనికి ఎన్ని గంటలు సమయం పడుతుంది? మానవసాధ్యమేనా? పగలంతా కూర్చొని కదలక మెదలక లక్ష జపించవచ్చుననుకున్నప్పటికి, రాత్రివేళ మైథునక్రియలోనుండి లక్షజపం సాధ్యమా!? పైగా, వీర్యస్ఖలనం కాని స్థితిలో ఈ లక్షజపం జరగవలె! ఎంత జితేంద్రియునకైన, .... ఏమో! అందుకే **పూజనపద్ధతి** దాన్ని 1100కు ఈవిధంగా కుదించింది :

శ్లో॥ శతం భాలే శతం కేశే శతం సిందూరమండలే ।
శతత్రయం కుచద్వన్ద్వే శతం నాభౌ మహేశ్వరి ।
శతం యోనౌ మహేశాని సంయోగే చ శతత్రయమ్ ।
జపేత్ తత్ర మహేశాని తదన్తే ప్రపఠేత్ స్తవమ్ ॥

ఇట్లా అంగాంగవిభాగంగా 1100 జపించి, తదన్తే, సంభోగాంతంలో కాళీస్తోత్రమునో లేక పూర్వం చెప్పబడిన యోనిస్తోత్రమునో పఠించవలెనని. ఇది లక్షజపంగా పరిగణింపబడుతుందని భావం గ్రాహ్యం.

ఇదే పూజనపద్ధతి ఇట్లా కూడా చెప్పింది :

శ్లో॥ పశుభావరతో మన్త్రీ దివా లక్షం జపం చరేత్ ।
స్వాచారనిరతో వీరో రాత్రౌ లక్షం జపం చరేత్ ॥

పశుభావంలోని సాధకుడు పగటివేళ లక్షయని, వీరభావంలోని వాడైతే, రాత్రివేళ లక్షజపమనీ భావం.

దివ్యభావంలోని సాధకుడున్నూ జపం ఆ విధిలోనే చేస్తాడు. అయితే, పగలు లక్ష అన్నది మొత్తం జపం ఒకే రోజులో కాక ప్రతిరోజూ ప్రాతఃకాలం మొదలు మధ్యాహ్నం వరకు ఎంత జపం చేయగలడో, మొదటిరోజు జపం ప్రమాణంగా, తర్వాతి రోజులలోనూ కొనసాగించవలెనంటుంది **ముండమాలా** :

శ్లో॥ ప్రాతఃకాలం సమారభ్య జపేన్మధ్యదినావధి ।
ప్రథమేఽహని యజ్జప్తం తజ్జప్తవ్యం దినే దినే ॥

ఈ తంత్రంలోనే రాత్రి జపనిర్దేశమూ చేయబడింది, ఇట్లా :

శ్లో॥ గతే తు ప్రథమే యామే తృతీయప్రహరావధి ।
నిశాయాం తు ప్రజప్తవ్యం రాత్రిశేషే జపేన్న చ ॥

అనగా, రాత్రి రెండవ, మూడవ జాములలోనే, అర్ధరాత్రి కనుక, అప్పుడే జపించవలెను, అని.



## 6. ఫలస్తుతి

**శ్లో॥ ఇదం స్తోత్రం మాతస్తవ మనుసముద్ధారణమను -**
**స్వరూపాఖ్యం పాదామ్బుజయుగలపూజావిధియుతమ్ ।**
**నిశార్ధే వా పూజాసమయమధి వా యస్తు పఠతి**
**ప్రలాపస్తస్యాపి ప్రసరతి కవిత్వామృతరసః ॥ 21**

**అన్వయక్రమం :** (హే) మాతః! తవ మనుసముద్ధారణం పాదాంబుజయుగలపూజావిధి–యుతమ్ అనుస్వరూపాఖ్యమ్ ఇదం స్తోత్రం నిశార్ధే వా పూజాసమయమ్ అధి యః తు పఠతి, తస్య ప్రలాపః అపి కవిత్వామృతరసః ప్రసరతి ॥

**ప్రతిపదార్థం :** (హే) మాతః = ఓ తల్లీ!, తవ = నీయొక్క, మను = మంత్రమును, సముద్ధారణమ్ = ప్రకటించుట, పాదాంబుజయుగల = పద్మములవంటి పాదముల జంటయొక్క, పూజావిధి = పూజావిధానముతో, యుతమ్ = కూడిన, అనుస్వరూప = స్వరూపమును అనుసరించి, ఆఖ్యమ్ = చెప్పబడినదైన, ఇదం స్తోత్రమ్ = ఈ స్తోత్రమును, నిశార్ధే = అర్ధరాత్రియందు, వా = లేక, పూజాసమయమ్ = పూజచేయువేళను, అధి = దాటిన తరువాత, యః తు = ఎవడైతే, పఠతి =

పఠించుచున్నాడో, తస్య = వానియొక్క, ప్రలాపః అపి = వాగుడైనను, కవిత్వామృతరసః = కవిత్వామృతరసమును, ప్రసరతి = ప్రవహింపజేయును.

**తాత్పర్యం :** ఓ తల్లీ! నీ మంత్రాన్ని ప్రకటించటం, నీ పూజావిధానం, నీ స్వరూపవర్ణనంతో చేర్చి చెప్పబడిన ఈ స్తోత్రాన్ని అర్ధరాత్రివేళ, లేక నీ పూజాసమయం దాటిన తరువాతనైన, పఠించినవాని నోట వెలువడిన వాక్కులన్నియు కవిత్వామృతమై ప్రవహించును.

**మన్త్రోద్ధారప్రకరణంలోని శ్లోకాలలో (కర్పూరస్తవంలో మొదటి 6 శ్లోకాలలో) దక్షిణకాళికాదేవిదైన ద్వావింశత్యక్షరీవిద్యారాజ్ఞీ మంత్రాన్ని తన్త్రశాస్త్రోక్తంగా రాబట్టి, సాధకుడామెను ఆరాధించవలసిన విధానాన్ని నిర్దేశించి, ఆ మంత్రాధిదేవత స్వరూపాన్ని వర్ణించి చెప్పిన స్తవమిది. దీనిని పూజావిధిలో భాగంగా పఠించటం సముచితం. ఒకవేళ వేరే సమయంలో పఠించినప్పటికీ ఈ స్తవం సఫలమే తప్ప నిష్ఫలం కాదు. అంటే, సాధకులే కాక సామాన్యులున్నూ దీన్ని మిగత స్తోత్రాలవలెనే పఠించవచ్చు.**



**శ్లో॥ కురఙ్గాక్షీవృన్దం తమనుసరతి ప్రేమతరలం**
**వశస్తస్య క్షోణీపతిరపి కుబేరప్రతినిధిః ।**
**రిపుః కారాగారం కలయతి చ తం కేలికలయా**
**చిరం జీవన్ముక్తః ప్రభవతి స భక్తః ప్రతిజనుః ॥ 22**

**అన్వయక్రమం :** ప్రేమతరలం కురఙ్గాక్షీవృన్దం తమ్ అనుసరతి । కుబేరప్రతినిధిః క్షోణీపతిః అపి తస్య వశః భవతి । (తస్య) రిపుః కారాగారం కలయతి । స చ భక్తః కేలికలయా చిరం జీవన్ముక్తః ప్రతిజనుః ప్రభవతి ॥

**ప్రతిపదార్థం :** తమ్ = వానిని, ప్రేమతరలమ్ = ప్రేమచే వివశులై, కురఙ్గాక్షీవృన్దమ్ = లేడికన్నులవంటి అందమైన కన్నులుగల యువతీబృందము, అనుసరతి = అనుసరించు చున్నది, కుబేరప్రతినిధిః = కుబేరునకు ప్రతినిధి, అనగా సమానుడు, అనదగిన, క్షోణీపతిః అపి = మహారాజైనను, తస్య = వానికి, వశః (భవతి) = వశుడగుచున్నాడు, (తస్య) రిపుః = (వాని) శత్రువు, కారాగారమ్ = చెఱసాలను, కలయతి = చేరుచున్నాడు, సః చ భక్తః = అట్టి భక్తుడేమో, ప్రతిజనుః = ప్రతిజన్మలోను, కేలికలయా = శృంగారకేళిచే, జీవన్ముక్తః = జీవించియుండగనే ముక్తుడుగా, ప్రభవతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** దక్షిణకాలికా సాధకుడైన భక్తుడు కర్పూరస్తవరాజాన్ని పఠించుటవలన, వానిని ప్రేమచే వివశులైన తరుణీబృందము అనుసరిస్తుంది. కుబేరునంతటి సంపన్నుడైన మహారాజైనను వానికి వశవర్తియవుతాడు. వాని శత్రువు చెఱసాల పాలవుతాడు. ఆ భక్తుడేమో స్వయంగా శృంగారరసానందాన్ని ప్రతిజన్మలోనూ ఆస్వాదిస్తూనే జీవన్ముక్తుడవుతాడు.

ఫలశ్రుతిగా స్త్రీవశీకరణ, సంపద్వశీకరణ, శత్రుంజయత్వం ఈ శ్లోకంలో చెప్పబడినవి. ఇతఃపూర్వం ప్రతిశ్లోకంలోనూ ఫలశ్రుతి ఇట్టిదే చెప్పబడినది. లౌకికమైన ఈ వశీకరణల లాభంతో పాటుముక్తి కూడా చెప్పబడినది. ఈ సందర్భంలో కలిగే సంశయం, లౌకిక కామ్యాలతో చేసే సాధనకు ముక్తిఫలం ఎట్లా సాధ్యమని. అందుకే, ఈ సంప్రదాయంలో ప్రధానంగా చెప్పబడిన విషయం భావశుద్ధి, ఏకాగ్రమనస్కత, దైహికేంద్రియానుభవానందాన్ని యథాతథంగా అనుభవించక జితేంద్రియుడై ఆత్మ–పరమాత్మ, శివశక్తి సంయోగానందాన్ని పొందుతూ శివశక్తిమయుడుగా సాధకుడు పురోగమించవలెనన్నది. ఇది శక్తిసాధన మార్గంగా స్వీకరించబడింది. ఈ దైహికాచార మార్గం చాల కష్టసాధ్యం.

దీనికి దక్షిణాచార, దివ్యాచారమూలకములైన అర్థాలు, పద్ధతులు వేర్వేరుగా ప్రతిపాదింపబడినవి.

స్త్రీయనగా సిద్ధి. యక్షిణీ, యోగినీ ఆది దివ్యసిద్ధులే స్త్రీబృందంగా చెప్పబడింది. అట్లే సంపద్వశీకరణం విష్ణుప్రసన్నతగా, రిపుంజయత్వం అంతశ్శత్రునాశక యోగశక్తి ప్రసన్నతగా చెప్పబడింది. వీనిని సాధించగల భక్తునకు జితేంద్రియత్వం సిద్ధించినట్లే. కనుకే జీవన్ముక్తుడన్నమాట సార్థకం. అట్టివాడు ఎన్ని జన్మలెత్తినప్పటికి, అన్ని జన్మలలోను యోగమార్గానురక్తుడై సిద్ధుడై జీవన్ముక్తుడవుతాడు, అన్నది సహజోక్తియే కదా!

**క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణే కాలికే**
**క్రీం క్రీం క్రీం హూం హూం హ్రీం హ్రీం స్వాహా ॥**

**ఓమ్**

**శమ్**